శ్రీమతే రామానుజాయ నమః



# కేనోపనిషద్వ్యాఖ్యానమ్


తమిళ మూలం: శ్రీవైష్ణవసింహ ఉ.వే.శ్రీమాన్

**ఎస్. కృష్ణస్వామి అయ్యంగార్‌స్వామివారు**





**తెలుగు అనువాదం:**

పండితరత్న, వేదాంతవాచస్పతి, సత్సంప్రదాయసుధాంబుధి

**ఉ.వే. శ్రీమాన్ డా ॥ ఈ.ఏ. శింగరాచార్యస్వామి**

సంపాదకుడు:

**ఈయుణ్ణి అనంత రంగ రామన్**



**మే, 2021**

శ్రీమతే రామానుజాయ నమః

## విజ్ఞప్తి

భగవంతుడైన శ్రీమన్నారాయణుడు మహాశక్తిసంపన్నులైన మహర్షుల ద్వారా సంస్కృత వేదాన్ని దివ్య జ్ఞాన సంపన్నులైన దివ్యసూరుల ద్వారా ద్రవిడ వేదాన్ని లోకంలో అవతరింపజేశాడు.ఈ రెండు వేదాలు తత్వదర్శనంలో రెండు కన్నులవంటివి. రెండు కన్నులతో దర్శించే వస్తుస్వరూపం ఒకే విధంగా ఉండేటట్లు, ఈ రెండు వేదాల ద్వారా దర్శింపబడే తత్వం ఒకే విధంగా మనకు గోచరిస్తుంది. ఈ విషయాన్ని గుర్తించిన మన పూర్వాచార్యులు తమ దివ్యప్రబంధ వ్యాఖ్యానాలలో పలుచోట్ల ఆళ్వారుల సూక్తులను వివరిస్తూ, ఆ వివరణలో ఆ సూక్తుల భావాలు ప్రతిబింబించే సంస్కృత వేదంలోని సూక్తులను ఉదాహరించారు.

గత శతాబ్దంలో, ఈ శతాబ్దం ప్రారంభంలో ఉభయ వేదాంత సంప్రదాయానికి ఎనలేని సేవ చేసి, రామానుజ సిద్ధాంతాన్ని 60 సంవత్సరాలకు పైగా తమ 'సుదర్శనం' పత్రిక ద్వారా ప్రచారం చేసిన మహనీయులు శ్రీవైష్ణవసింహ ఉ.వే.శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్‌స్వామివారు. వీరు కేనోపనిషత్తుకు లభించే పలు వ్యాఖ్యానాలను సమీక్షిస్తూ, ఆ ఉపనిషత్తులోని సూక్తులకు ఆళ్వార్ల సూక్తులతో ఉండే అర్థసామ్యాన్ని తెలుపుతూ ఒక వివరణను ద్రావిడంలో రచించారు. విలక్షణమైన రీతిలో ఉండే ఈ వ్యాఖ్యను ఆంధ్రీకరిస్తే సంప్రదాయ పాఠకులకు ఆనందం కలుగుతుంది అనే ఉద్దేశ్యంతో దాసుడు ఈ వ్యాఖ్యానాన్ని ఆంధ్రీరించాడు. ఈ వ్యాఖ్యానం



ఉభయవేదాంత సంప్రదాయ అభిమానులకు తప్పక తృప్తిని కలిగించగలదు అని నా విశ్వాసం. అనువాదంలోని లోటుపాట్లను సహృదయ పాఠకులు తప్పక క్షమిస్తారని భావిస్తాను. ఈ గ్రంథాన్ని డిటిపి చేయడంలో సహకరించిన శ్రీమతి జయకు, చంద్రశేఖర్‌కు కృతజ్ఞతలు. గ్రంథాన్ని సిద్ధంచేయడంలో కృషిచేసిన కుమారుడు చిరంజీవి రామన్‌కు అనేక మంగళాశాసనాలు.



భాగవతవిధేయుడు
ఈ.ఏ. శింగరాచార్యులు.

శ్రీమతే రామానుజాయ నమః





శ్రీవైష్ణవసింహ ఉ.వే.శ్రీమాన్ ఎస్.కృష్ణస్వామి అయ్యంగార్‌స్వామివారు



శ్రీమతే రామానుజాయ నమః



# కేనోపనిషద్వ్యాఖ్యానమ్

**ప్రణమ్య శ్రీపతిం దేవం సర్వస్రష్టార మీశ్వరమ్ ।**
**కేనోపనిషద్వ్యాఖ్యాం శ్రీకృష్ణస్తనుతే ముదా ॥**

శ్రియఃపతి, సమస్తజగత్తును సృష్టించినవాడు, సర్వలోకేశ్వరుడైన నారాయణుని ప్రణమిల్లి, శ్రీ కృష్ణుడు (అనే శ్రీసుదర్శన పత్రికాధిపతి) కేనోపనిషత్ వ్యాఖ్యానాన్ని చేస్తున్నారు.

ఈ ఉపనిషత్తు సామవేదానికి చెందిన జైమినీయబ్రాహ్మణంలో ఉన్నది. సామవేదంలోని జైమినీయశాఖకు చెందినది కనుక జైమినీయోపనిషత్ అని, తలవకారోపనిషత్ అని ఇది వ్యవహరింపబడుతున్నది. "ఈశ" అని ఆరంభమయే ఉపనిషత్ "ఈశోపనిషత్" అని పిలువబడేటట్లే, "కేన" అని ఆరంభమయే ఈ ఉపనిషత్ "కేనోపనిషత్" అని వ్యవహరింపబడుతున్నది. ఈ ఉపనిషత్తులో నాల్గు ఖండాలున్నాయి. మొదటి రెండు ఖండాలలో "పరతత్త్వం ఇంద్రియాలకు అందనిది; పరిచ్ఛేదించి తెలియలేనిది" అని నిరూపింపబడింది. మిక్కిలి బలం కల్గిన ఇంద్రుడు మొదలైన దేవతల మహిమలు కూడా పరమాత్మవల్లనే కల్గినవి-అని మిగిలిన రెండు ఖండాలలో ఒక ఉపాఖ్యానం ద్వారా నిరూపింబడుతున్నది.

ఈ ఉపనిషత్తుకు శ్రీశంకరులు అద్వైత సిద్ధాంతపరంగా భాష్యాన్ని రచించారు. పలు ఉపనిషత్తులకు విశిష్టాద్వైత సిద్ధాంత పరంగా భాష్యాన్ని

రచించిన శ్రీరంగరామానుజమునివరులు (క్రీ.శ. 18వ శతాబ్దిలో వేంచేసి ఉన్నవారు) దీనికి కూడా భాష్యాన్ని రచించారు. క్రీ.శ. పదహారవ శతాబ్దిలో ఉత్తరభారతంలో జీవించిన రామానందులు దశోపనిషత్తులకు సంగ్రహంగా వ్యాఖ్యానాన్ని, (స్వామి నారాయణ సంప్రదాయానికి చెందిన) గోపాలనందులు (క్రీ.శ. 1781-1852), భారద్వాజ రామానుజాచార్యుల వారు (క్రీ.శ.1790-1890) ఈ ఉపనిషత్తుకు విశిష్టాద్వైతపరంగా భాష్యాన్ని రచించారు. విశిష్టాద్వైత పరమైన ఈనాల్గు సంస్కృత భాష్యాలు మేల్కోట సంస్కృతం రీసెర్చి అకాడమీ ద్వారా చాలా అందంగా ప్రచురింపబడ్డాయి. రామానందులు రచించినది ఆనందభాష్యం. రంగరామానుజముని రచించినది 'ప్రకాశికా' అనే భాష్యం. గోపాలనందులు రచించినది "సుబోధినీ" భాష్యం. భారద్వాజ రామానుజాచార్యులవారు రచించినది "ప్రతిపదార్థదీపికా" భాష్యం. విశిష్టాద్వైతపరంగా ద్రావిడంలో ఇంతవరకు ఏ వ్యాఖ్య లేని కొఱత తీరేటట్లు, పూర్వం తెల్పిననాల్గు భాష్యాలలో గల సారార్థాలను అంతర్భవించుకొన్న ఈ వ్యాఖ్యానంలో ద్రావిడవేదమనే దివ్యసూరుల సూక్తులకు, సంస్కృతవేదమైన ఈ ఉపనిషత్తులకు మధ్యగల ఐకకంఠ్యం కూడా ప్రస్తావింపబడుతుంది.

సామవేద శాంతిపాఠం :-

ఓమ్. ఆప్యాయంతు మమాంగాని వాక్ ప్రాణశ్చక్షుః శ్రోత్రమథో బలమింద్రియాణి చ సర్వాణి. సర్వం బ్రహ్మౌపనిషదమ్. మాహం బ్రహ్మ నిరాకుర్యామ్. మా మా బ్రహ్మ నిరాకరోత్. అనిరాకరణమస్తు. అనిరాకరణం మేస్తు. తథాత్మాని నిరతే య ఉపనిషత్సు ధర్మాస్తే మయి సంతు, తే మయి సంతు. ఓమ్ శాంతిః శాంతిః శాంతిః.

(నా అంగాలైన వాక్కు, ప్రాణం, హస్తాలు, కన్నులు, చెవులు, బలం మిగిలిన ఇంద్రియాలు అనే అన్నీ వృద్ధి చెందాలి. ఇవి అన్నీ ఉపనిషత్తులలో చెప్పబడే బ్రహ్మమే (బ్రహ్మంయొక్క ప్రకాశమే). నేను బ్రహ్మాన్ని నిరాకరించను. నన్ను బ్రహ్మం నిరాకరించకుండా ఉండాలి. నేను ఆ పరబ్రహ్మం పట్ల అభినివేశాన్ని పొందినందున ఉపనిషత్తులలో చెప్పబడిన ధర్మాలు నాలో కలగాలి. ఓంశాంతిః శాంతిః శాంతిః)



## ప్రథమఖండం

హరిః ఓమ్

1. **కేనేషితం పతతి ప్రేషితం మనః**
**కేన ప్రాణః ప్రథమః ప్రైతి యుక్తః ।**
**కేనేషితాం వాచమిమాం వదంతి**
**చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి ॥**

మనః = మనస్సు, కేన ప్రేషితమ్ = ఎవనిచే ప్రేరేపింపబడి, ఇషితం పతతి = కోరే విషయాలలో ఆసక్తిని పొందుతున్నది?, ప్రథమః ప్రాణః = ముఖ్యప్రాణం, కేన యుక్తః = ఎవనిచే ప్రేరేపింపబడి, ప్రైతి = శరీరాన్ని ధరించేదై, సంచరిస్తున్నది!, కేన ప్రేషితామ్ ఇమాం వాచం= ఎవనిచే ప్రేరేపింపబడి (వాగింద్రియాన్ని సహాయంగా చేసికొని) ఈ వార్తను, వదంతి = (లోకులు) పల్కుతున్నారు, చక్షుః శ్రోత్రం = కళ్ళు, చెవులు మొదలైనవానిని, క ఉ దేవః యునక్తి = ఏ దేవుడు ప్రేరేపిస్తున్నాడు?

**అవతారిక :-** జీవాత్మకంటే పరమాత్మ విలక్షణుడు-అనే విషయాన్ని ఈ ఉపనిషత్తు ప్రశ్నోత్తరాల రూపంలో నిరూపిస్తున్నది. లోకంలో ఉండే అందఱికి మనస్సు మొదలైన ఇంద్రియాలు శాస్త్రాలలో నిషేధింపబడిన విషయాలలో, తాము కోరని విషయాలలోను ఆసక్తిని

పొందడం, శాస్త్రాలలో విధింపబడిన విషయాలలో, తాము కోరే విషయాలలలో కూడా ఆసక్తం కాకపోవడం గమనిస్తున్నాము. ఈ ప్రవృత్తి నివృత్తులు అనేవి వీటిని ప్రేరేపించే ఒక చేతనుడు లేకపోతే సంభవించవు. నరికేవాడు లేకుండా గొడ్డలి తనకు తానే చెట్టును కొట్టలేదు కదా! అందుచేత, ఈ విధంగా ప్రేరణ చేసే పురుషుడెవడు? అని ప్రశ్నించే ఒక శిష్యుని ప్రశ్నను మొదటి మంత్రంలో ప్రస్తావించి, దానికి ఆచార్యుడు పలికే సమాధానాన్ని అనంతర మంత్రంలో తెలుపడం జరిగింది.

వ్యాఖ్యానమ్: **(మనః)**- ఈ లోకంలో మనం చూచే సంసారి జీవుల మనస్సు,

**(కేన ప్రేషితమ్)**- ఏ పురుషునిచే ప్రేరేపింపబడి-అని అర్థం. మనవంటి ఒక సంసారి జీవుడే ఇతరుల మనస్సులను ప్రేరేపిస్తున్నాడా? లేక, మనకంటే చాలా విలక్షణుడై, ఏ నైచ్యం లేని (దోషం లేని) వాడైన పరమపురుషుడు వీరిని ప్రేరణ చేస్తున్నాడా? అనేది ప్రశ్నలోని తాత్పర్యం.

**(ఇషితం పతతి)**- తాను కోరే విషయాలలో ఏ పురుషునిచే మనస్సు ఆసక్తమవుతున్నది? "ఇషితమ్" అంటే "ఇష్టమ్" అని అర్థం. "ఇషితమ్" అని "ఇట్" ప్రత్యయం చేరడం ఛాందసం (వైదిక ప్రక్రియ). ఇక్కడ ఇష్టాలను పల్కడం అనిష్టాలకు కూడా ఉపలక్షణం. కొన్ని సమయాలలో తాను కోరనివాటిలో కూడా మనస్సు సక్తమవుతున్నది కదా! ఈ మనస్సు అచేతనం కనుక, తానే స్వయంగా విషయాలలో సంక్రమిస్తున్నది- అని చెప్పడానికి వీలు లేదు. జీవుడు కోరని విషయాలలో కూడా ఇది (మనస్సు) లగ్నమవుతున్నందున జీవుడు దీనిని ప్రేరేపిస్తున్నాడు-అని అనలేము. ఇందువల్ల జీవుని అభిలాషను కూడా అతిక్రమించేటట్లు చేసి, దీనిని ప్రేరేపించేవాడు వేఱొకడు తప్పక ఉండాలి. అతడెవరు? అనేది ప్రశ్నలోని సారం.



**(ప్రథమః ప్రాణః)**- ప్రాణాలు-అనబడే అన్ని ఇంద్రియాల కంటే గొప్పదై, అందువల్లనే "ముఖ్యప్రాణ"మనబడే పంచవృత్తి (అయిదు వృత్తులను కల) ప్రాణమని అర్థం. "అయిదు చోట్ల ఉండి అయిదు కార్యాలను నిర్వహించే ప్రాణ, అపాన, సమాన, ఉదాన, వ్యానాలనే అయిదు ప్రాణాలలోముఖ్యమైనదై, హృదయంలో ఉండి తన కార్యాన్ని నిర్వహించే ప్రాణాన్ని ఈ పదం తెల్పుతుంది" అని రామానందుల ఆనందభాష్యం.

**(కేన యుక్తః ప్రైతి)** - ఏ దేవునిచే ప్రేరేపింపబడి శరీరం అంతా సంచరించేదై, శరీరధారణమనే తన కార్యాన్ని చేస్తున్నది? అని అర్థం. "ప్రేషితమ్" అనే పదస్థానంలో ఈ పదం ప్రయోగింపబడినందున "యుక్తః " అనే పదం "ప్రేరేపింపబడి" అనే అర్థాన్ని ఇస్తుంది.

**(కేన ప్రేషితం వాచమిమాం వదంతి)**- "ప్రైతి" అనే పదంలో ఉండే "ప్ర" అనే ఉపసర్గను "ఇషితమ్" అనే పదంతో చేర్చుకోవాలి. ఏ దేవునిచే ప్రేరేపింపబడిన ఈ వాక్కును లోకులు వాగింద్రియంతో పల్కుతున్నారు? వాగింద్రియాన్ని ప్రేరేపించేవారెవరు? అని తాత్పర్యం. "లోకాః" అనే పదాన్ని ఇక్కడ అధ్యాహరించుకోవాలి.

**(చక్షుః శ్రోత్రం క ఉ దేవో యునక్తి)** -కన్నులను, చెవులను ఏ దేవుడు ప్రేరేపిస్తున్నాడు? ప్రాణం కల ప్రాణుల అంగమైనందున "చక్షుః శ్రోత్రం" అని ఏకవచనంలో (జాత్యేకవచనంలో) ప్రయోగింపబడింది. ఇక్కడ మనస్సు, వాక్కు, నేత్రం, చెవి-అనే ఇంద్రియాలను ప్రస్తావించడం మిగిలిన ఇంద్రియాలకు కూడా ఉపలక్షణం. "దేవః" అని అన్నందున "ఇతడు దేవతలలో ఒకడై ఉండాలి" అని తెలుపబడింది. "దివ్యో దేవ ఏకో నారాయణః" అని ఈ సాటిలేని దేవుడు నారాయణుడే అని సుబాలోపనిషత్ పల్కిన విషయం ఇక్కడ అనుసంధేయం. అతడే కదా హృషీకేశుడని శాస్త్రాలలో ఘోషింపబడుతున్నాడు. ఈవిధంగా మన

ఇంద్రియ, ప్రాణాలను నియమించే పురుషుడు ఎవరు? అనేది శిష్యుని ప్రశ్నరూపంగా ఉండే ఈ మొదటి మంత్రంలోని తాత్పర్యం. ఆ రీతిలో కాకుండా "కిమ్" అనే పదం ఆక్షేపార్థంలో గ్రహించినపుడు, లోకంలోని పలువురు మానవులకు "మన ఇంద్రియాలు మొదలైనవి మనవశంలో ఉండేవే. మనకు మించి పరమాత్మ-అనే ఒకడు మనలను ప్రేరేపించడం లేదు" అనే రీతిలో వ్యక్తమయే స్వతంత్రాత్మభ్రాంతిని ఆక్షేపించడంకోసం బయలుదేరింది ఈ మొదటి మంత్రం-అని, తరువాత గల మంత్రాలు అందఱిని నియమించే సర్వేశ్వరుని గూర్చి వివరిస్తున్నవి-అని గోపాలానందులు సుబోధినీ వ్యాఖ్యలో అర్థాన్ని గ్రహించారు.

2. **శ్రోత్రస్య శ్రోత్రం మనసో మనో యత్**
**వాచో క వాచం న ఉ ప్రాణస్య ప్రాణః ।**
**చక్షుష శ్చక్షు రతిముచ్య ధీరాః**
**ప్రేత్యస్మాల్లోకాదమృతా భవంతి ॥**

**(మన ప్రాణేంద్రియాలను నియమించే ఆ దేవుడు ఎవరంటే-)** యత్= ఏ దేవుడు, శ్రోత్రస్య శ్రోత్రం = చెవికి వినబడే శక్తిని ఇచ్చినవాడై, మనసః మనః = మనస్సుకు భావించే శక్తిని కలవాడై, వాచః వాచం = వాక్కుకు పలికే శక్తిని ఇచ్చినవాడై, ప్రాణస్య ప్రాణః = ముఖ్య ప్రాణానికి శరీరాన్ని ధరించే శక్తిని ఇచ్చినవాడై ఉన్నాడో, న ఉ = **(ఉపనిషత్తులలో శరీరేంద్రియాలను నియమించేవాడని, ఒకే దేవుడని ఘోషింపబడే)** ఆ నారాయణుడే ఈ మహిమను కలవాడు, అతిముచ్య = **(ఇటువంటి పరమపురుషుని)** తెలిసికొని, ధీరాః = జ్ఞానులలో గొప్పవారు, అస్మాత్ లోకాత్ = ఈ ప్రాకృతలోకంనుండి, ప్రేత్య = విడుదలను పొంది, అమృతాః భవంతి= **(పరమపదంలో)** మరణం, జన్మమొదలైన నైచ్యాలను లేని ముక్తులవుతున్నారు.



**అవతారిక:** శిష్యుని ప్రశ్నలకు ఆచార్యుడు ఈ మంత్రం నుండి సమాధానం పల్కుతున్నాడు.

**వ్యాఖ్యానమ్: (యత్)** "యః" ఏ పురుషుడు-అని అర్థం. మంత్రంలో "సః" అనే ప్రయోగాన్నిబట్టి "యత్" అనేదానిని లింగవ్యత్యయం చేసి, "యః" అని పుంలింగపదంగా గ్రహించాలి. సుబాలోపనిషత్ మొదలైనవానిలో ఇటువంటి గొప్పతనాలను కలవాడుగా ప్రసిద్ధిని పొందినవాడు-అని భావం. ఈ మహిమలు ఇకపై వివరింపబడుతున్నాయి.

**(శ్రోత్రస్య శ్రోత్రం, మనసః మనః, వాచః వాచమ్, ప్రాణస్య ప్రాణః , చక్షుషః చక్షుః)** - శ్రోత్రం, మనస్సు, వాక్కు, ప్రాణం, నేత్రం మొదలైనవానికి క్రమంగా వినే శక్తిని, భావించే శక్తిని, పలికే శక్తిని, శరీరాన్ని ధరించే శక్తిని, చూచే శక్తిని ఇచ్చేవాడై ఉన్నాడో-అని భావం. పూర్వమంత్రంలో వలె ఇది అన్ని ఇంద్రియాలకు ఉపలక్షణం. "శ్రోత్రం, మనః, ప్రాణః, చక్షుః" అనేవానివలె ప్రథమావిభక్తిలో "వాక్" అని లేకుండా, "వాచమ్" అని ద్వితీయావిభక్తి రూపంగా ఉండడం ఛాందసం (వైదిక ప్రయోగం). ఈ విధంగా ఇతడు ప్రాణేంద్రియాలకు వాటివాటికి తగిన శక్తిని ఇచ్చేవాడై ఉండేటట్లే, తనకు ఏ శక్తిని అయినా ఇచ్చేవారెవరూ లేనందున ఎవరి ప్రేరణ అక్కరలేకుండా తాను స్వయంగా కార్యనిర్వహణ సమర్థుడని దీనివల్ల తెలుస్తున్నది.

**(స ఉ)** - ఇటువంటి మహిమలను కలవాడే పూర్వమంత్రంలో అనుసంధింపబడిన దేవుడు. "యో మనోంతరో యమయతి, శ్రోత్రమంతరో యమయతి, చక్షురంతరో యమయతి, ప్రాణమంతరో యమయతి" (బృహ-5-7-16-20), "యస్య మనః శరీరం, యో మనోంతరో సంచరన్" (సుబాల-7), "చక్షుశ్చ ద్రష్టవ్యం చ నారాయణః,

శ్రోత్రం చ శ్రోతవ్యం చ నారాయణః, జిహ్వా చ రసయితవ్యం చ నారాయణః, త్వక్చ స్పర్శయితవ్యం చ నారాయణః, మనశ్చ మంతవ్యం చ నారాయణః, వాక్చ వక్తవ్యం చ నారాయణః" (సుబాల-6) అని అన్ని ఇంద్రియాలకు, ప్రాణానికి అంతర్యామియై, వాటిని నియమించేవాడై, వాటిని శరీరంగా కలవాడై ఉన్నందున వాటిని "తాను" అనే పలికేటట్లు ఉన్నవాడుగా చెప్పబడేవాడై, "ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః" (సుబాల-7) (ఇతడే అన్ని వస్తువులకు అంతర్యామియై, పరమపదంలో ఉండేవాడై, సాటి లేని దేవుడైన నారాయణుడు) అని సాటి లేని దేవుడుగా ఉపనిషత్తులలో ప్రసిద్ధి చెందిన నారాయణుడనే దేవుడే అతడు- అని తాత్పర్యం. "ఉ" అనేపదం "ఏవ" అనే అర్థాన్ని కల్గినదై, ఉపనిషత్తులలో మిక్కిలి ప్రసిద్ధి పొందిన ఆ దేవుడే పూర్వమంత్రాలలో అడుగబడిన ప్రశ్నలకు బదులుగా ఉండేవాడు-అని తెల్పుతున్నది.

ఇక, మంత్రంలోని మిగిలిన భాగంతో ఇటువంటి దేవుని జ్ఞానులు తెలిసికొని, ఈ లోకంనుండి విడుదలను పొంది, పరమపదంలో ముక్తులవుతున్నారు-అని తెలుపబడుతున్నది.

**(ధీరాః)** - పరమపురుషుడే మనస్సు మొదలైన ఇంద్రియాలను ప్రేరేపిస్తున్నాడు- అని తెలిసిన ధీమతామగ్రేసరులు-అని అర్థం. (గొప్ప జ్ఞానులు)

**(అతిముచ్య)** - ముందు పల్కినట్లుగా గ్రహించి,

**(అస్మాత్ లోకాత్ ప్రేత్య)**- ఈ ప్రాకృతలోకంనుండి విడుదలను పొంది,

**(అమృతా భవంతి)** - మరణం మొదలైన నైచ్యాలను లేని



ముక్తులవుతున్నారు. "లోకాత్ ప్రేత్య" అనే దానికి దేహంనుండి విడుదలను పొందడం-అనే అర్థాన్ని కూడా చెప్పవచ్చు.

**(అతిముచ్య....)**- పరమాత్మయే సర్వాంతర్యామి-అని తెలియడంవల్ల స్వస్వాతంత్ర్యభ్రాంతి తీరి, భగవానుడే అన్ని ఇంద్రియాలను ఆయాకార్యాలలో ప్రవర్తింపజేస్తున్నాడు-అని భావించేవారై, ఈ సంసారలోకంనుండి అర్చిరాది గతిద్వారా పరమపదాన్ని చేరి, ముక్తిని పొందుతున్నారు-అనేదే ముఖ్యార్థం. ఇక్కడ ఈ లోకం నుండి విడుదలను పొంది, వేఱొక లోకంలో ముక్తిని పొందుతున్నట్లు పల్కినందున, "ఈ లోకంలోనే ముక్తిని పొందుతున్నారు" అని అద్వైతుల జీవన్ముక్తి వాదం ఈ ఉపనిషత్తులో ఆదరింపబడలేదని వ్యక్తమవుతున్నది. "శ్రోత్రస్య శ్రోత్రమ్" అని ఆరంభించి, జీవాత్మనే తెల్పుతున్నది-అని కొందఱు చేసిన వివరణం సరి కాదు-అని ఈ క్రింది కారణాలతో "సుబోధినీ" భాష్యంలో నిర్ణయింపబడింది. శ్రోత్రమనబడే ఇంద్రియం శబ్దాన్ని తెలిపే విషయంలో జీవునకు ఉపకరిస్తున్నది. జీవుడు శ్రోత్రంతో ఉపకారాన్ని పొందుతున్నాడు. శ్రోత్రంతో (చెవితో) ఉపకారాన్ని పొందేవానిని "శ్రోత్రస్య శ్రోత్రమ్" అని అనడం సరికాదు కదా! దీపంతో ఉపకారాన్ని పొందే నేత్రాన్ని "చక్షుషః చక్షుః" అని అనలేము కదా! అందువల్ల "శ్రోత్రం" మొదలైన ఇంద్రియాలకు "శ్రవణం" మొదలైన శక్తులను ఇచ్చే సర్వేశ్వరుడే "శ్రోత్రస్య శ్రోత్రమ్" మొదలైన పదాలతో తెలుపబడుతున్నాడని అనడమే పొసగుతుంది.

**3. న తత్ర చక్షుర్గచ్ఛతి న వాగ్గచ్ఛతి నో మనః ।**
**న విద్మో న విజానీమో యథైతదనుశిష్యాత్ ॥**

తత్ర = ఆ పరమాత్మ విషయంలో, చక్షుః = నేత్రం, న గచ్ఛతి = ప్రవర్తించదు, వాక్ = వాగింద్రియం కూడా, న గచ్ఛతి = ప్రవర్తించదు,

మనః = మనస్సు, నో (గచ్ఛతి) = ప్రవర్తించదు, (ఆ పరమాత్మను) యథా = ఉన్నది ఉన్నట్లుగా, న విద్మః = (మనస్సుతో) తెలియలేము, న విజానీమః = బాహ్యేంద్రియాలతో కూడా తెలియలేము, ఏతత్ = ఈ పరమాత్మను ఈ విధంగా ఇంద్రియాలతో తెలియలేము-అనే విషయాన్ని, అనుశిష్యాత్ = శిష్యులకు ఉపదేశించాలి.

**అవతారిక:** ఈ మంత్రంలో శ్రోత్రం మొదలైనవానికి అంతర్యామిగా చెప్పబడిన పరమాత్మయొక్క వైభవం మఱింత వ్యక్తమవుతున్నది.

**వ్యాఖ్యానమ్: (తత్ర)** పూర్వమంత్రంలో చెప్పబడిన పరమాత్మ విషయంలో,

**(చక్షుః న గచ్ఛతి)**- నేత్రం ప్రవర్తించదు. అంటే-ఘటాదులైన లోకంలో కన్పించే వస్తువులను చూచేటట్లు పరమాత్మను కంటితో చూడడం వీలు కాదు-అని తాత్పర్యం. ఇక్కడ కంటిని ప్రస్తావించడం జ్ఞానేంద్రియాలకు అన్నిటికి ఉపలక్షణం. ఈ విధంగా "జ్ఞానేంద్రియాలు పరమాత్మను తెలియలేవు" అని అన్నందున ప్రత్యక్షప్రమాణం ద్వారా ఆ పరమాత్మను తెలియడం సాధ్యం కాదు-అని ఏర్పడుతున్నది.

**(వాక్ తత్ర న గచ్ఛతి)** - పరమాత్మ విషయంలో వాక్కు ప్రవర్తించదు. లోకంలో కన్పించే వస్తువులను గూర్చి పల్కి తెలిపినట్లుగా, వాక్కుతో పరమాత్మను గూర్చిపల్కి తెలుపడం సాధ్యం కాదని భావం. ఈ విధంగా, ప్రత్యక్షానికి ఉపకరించే, లౌకికమైన శబ్దప్రమాణం పరమాత్మను గూర్చి తెలుపలేదు-అని భావం. ఇక్కడ వాక్కును పల్కడం కర్మేంద్రియాలకు అన్నిటికి ఉపలక్షణం. లోకంలో చూచే వస్తువులను చేతితో గ్రహించేటట్లు పరమాత్మను చేతితో గ్రహించడం సాధ్యం కాదు.



కాలితో అతనిని చేరి పొందడం సాధ్యం కాదు-అని ఈ విధంగా అర్థాన్ని గ్రహించాలి.

**(మనః తత్ర నో గచ్ఛతి)**- మనస్సు కూడా ఆ పరమాత్మ విషయంలో ప్రవర్తించలేదు, ధ్యానించలేదని భావం. లౌకికమైన ప్రత్యక్షానికి సహాయపడేదై మనోవ్యాపారాన్ని ముఖ్యంగా గల అనుమాన ప్రమాణంకూడా పరమాత్మను తెలుపలేదు-అని దీనివల్ల తెలుపబడుతున్నది. అంతర్యామి బ్రాహ్మణంలో- "యం వాక్ న వేద, యం చక్షుర్న వేద యం శ్రోత్రం న వేద, యో న స్త్రద్వేద" (బృహ-5-7-21, 22, 23, 24), "యం మనో న వేద" (సుబాల-7) అని నారాయణుని గూర్చి ఇంద్రియాలతో తెలియడానికి సాధ్యం కాని వాడు-అని పల్కడాన్నిబట్టి ఇక్కడ చెప్పబడే పరమాత్మ నారాయణుడే-అని స్పష్టపడుతున్నది.

ఆ విధంగా అయితే, ఆ పరమాత్మనుగూర్చి ఏ విధంగా తెలియాలి? అనే ప్రశ్నకు సమాధానాన్ని మంత్రంలోని ఉత్తరార్ధం తెలుపుతున్నది.

**(న విద్మః యథా)**- ఆ పరమాత్మను యథాతథంగా అంతరింద్రియమైన మనస్సుతో తెలియలేము.

**(న విజానీమః యథా)**- ఆ పరమాత్మను బాహ్యేంద్రియాల ద్వారా తెలియలేము. ఆ విధంగా అయితే మఱి, ఆ పరమాత్మను గూర్చి ఏ విధంగా ఉపదేశించాలి? అని అంటే,

**(ఏతత్ అనుశిష్యాత్)**- ఆ పరమాత్మను "మనస్సులో, బాహ్యేంద్రియాలలో తెలియడం సాధ్యం కాదు" అని శిష్యులకు ఉపదేశించాలి.

మంత్రంలోని ఉత్తరార్ధానికి ఇంకొక విధంగా కూడా అర్థాన్ని గ్రహించవచ్చు. "ఏతత్"- మనచే చూడబడే ఘటాదిపదార్థాలను, యథా= ఏ రీతిలో (ప్రారంభంలో పెద్దదిగా, పైకి వెళ్ళే కొద్దీ చిన్నదిగా ఉండే రూపాన్ని కల్గిన ఒక పాత్ర, ఘటం = ఇత్యాది వర్ణనలతో) అనుశిష్యాత్ = ఉపదేశించవచ్చునో, న విద్మః = ఆ విధంగా పరమపురుషుని గూర్చి ఉపదేశించే రీతిని తెలియలేము. "ఈవిచిత్రమైన లోకంలో ఆ పరమాత్మ వంటి వేఱొక వస్తువు ఉండవచ్చుకదా. ఆ వస్తువును ఉదాహరణంగా చూపి, విశేషంగా విశదంగా ఉపదేశించవచ్చుకదా! అనేది శిష్యుని అభిప్రాయంగా తలచి, న విజానీమః = లోకంలోని ఏవస్తువులో ఉండే ఏ స్వభావమైనా ఈ పరమాత్మలో లేనందున, ఆ విధంగా ఒక ఉదాహరణాన్ని చూపి, విశేషంగా, విశదంగా ఉపదేశించడానికి మాకు సాధ్యం కాదు. అందుచేత, అతనిని గూర్చి పూర్ణంగా ఉపదేశించడం సాధ్యం కాదు. తెలియడం కూడా సాధ్యం కాదు-అని తాత్పర్యం.

లేక, ఇక్కడ ఇంకొక విధంగాకూడా అర్థాన్ని చెప్పవచ్చు.

**(న విద్మః)**- ఆ పరమాత్మను పరిచ్ఛేదించి తెలియలేము.

**(న విజానీమః యథైతదనుశిష్యాత్)** - లోకంలో కన్పించే పదార్థాలకంటే చాలా విలక్షణమైన ఈ పరమాత్మను గూర్చి ఉపదేశించే క్రమం కూడా తెలియలేము. మేము తెలియలేము. ఉపదేశించలేము కూడా-అని భావం. ఈ విధంగా ఈ మంత్రంలో ఆ పరమాత్మ ఇంద్రియ గోచరం కాదని, పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కాదని, ఉపదేశించడానికి సాధ్యం కానిది-అని చెప్పబడినట్లయింది.

**ఇక్కడ ఉభయవేదాంతార్థ సామ్యం (1,2,3, మంత్రాలలో):**

ఈ మూడు మంత్రాలలో (1) ఇంద్రియాలను ఆయా కార్యాలలో



ప్రేరేపించేవాడు పరమాత్మ (2) ఇంద్రియాలకు ఆయా శక్తులను ఇచ్చేవాడు పరమాత్మ, (3) తనను తెలిసినవారికి పరమపదంలో మోక్షాన్ని ప్రసాదించేవాడు పరమాత్మ, (4) ఇంద్రియాలకు గోచరం కానివాడు పరమాత్మ, (5) ఎవరికీ పరిచ్ఛేదించి తెలియడానికి కాని, ఉపమానపురస్సరంగా వివరించి తెలుపడానికి కాని సాధ్యం కానివాడు పరమాత్మ-అనే విషయాలు తెలుపబడ్డాయి.

(1) ఇంద్రియాలను ప్రేరణ చేసేవాడు, వాటికి ఆయా శక్తులను ఇచ్చేవాడు-అనే అర్థాన్ని కల హృషీకేశ (ఇరుడీకేశ) నామాన్ని "ఎన్ ఇరుడీకేశనే, ఇరుడీకేశన్ ఎమ్బిరాన్" (తిరువాయ్-2-7-9-10), "ఇరుడీకేశన్ తనక్కు త్తొణ్డ క్కులత్తిలుళ్ళీర్" (తిరుప్పల్లాండు-5), "ఇరుడీకేశా! ములైయుణాయే" (పెరియా*ళ్వా*ర్ తిరు-2-2-6), "ఇరుడీకేశా! ఎన్ తన్ కణ్ణే!" (పెరియా*ళ్వా*ర్ తిరు-2-3-10), "ఎన్ అప్పా! ఎన్ ఇరుడీకేశా! ఎన్నుయిర్ క్కావలనే" (పెరియా*ళ్వా*ర్ తిరు- 5-4-5), "ఇరుడీకేశన్ వలిశెయ్య" (నాచ్చి.తిరు-5-6) అని ఆ*ళ్వా*ర్లు, గోదాదేవి హృషీకేశ శబ్ద ప్రయోగం ద్వారా అనుసంధించారు. "తున్ను కరచరణమ్ ముదలాక ఎల్లా వుఱుప్పుమ్ నీయే" (దృఢమైన కరచరణాది అవయవాలు కూడా నీవే) (తిరువాయ్-7-8-9), "శెవి వాయ్, కణ్ మూక్కు ఉడల్ అన్జైమ్బులనుమ్ శెన్దీ పువి కాల్ నీర్ విణ్పూదమైన్దుమ్, అవియాద ఞానముమ్ వేళ్వియుమ్ నల్లఱముమెన్బరే ఏనమాయ్ నిన్ఱార్క్కు ఇయల్వు" (చెవి, నోరు, కన్ను, ముక్కు, శరీరం-అయిదు ఇంద్రియాలు ఎఱ్ఱని అగ్ని, భూమి, వాయువు, నీరు, ఆకాశం అనే అయిదు భూతాలు, నశించని జ్ఞానం, యాగం, సద్ధర్మం-ఇవన్నీ వరాహరూపాన్ని ఎత్తిన స్వామిని పొందడానికి ఉపాయాలు. అతని అధీనంలో ఉండే సాధనాలు) (ముదల్ తిరు-12), "పొఱియైమ్బులనుమ్ పొఱియైన్దుమ్ కరుమేన్దిరియమ్

ఐమ్బూదమ్... ఉన్ మామాయై" (వృద్ధి చెందే జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు, పంచభూతాలు, ఈ సంసారంలో ఈ జీవాత్మతో కలసి ఉండే ప్రకృతి, మహత్తత్త్వం, అహంకారతత్త్వం, మనస్సు నీ ఆశ్చర్యకరమైన ప్రకృతి ప్రాకృతాలు.) (తిరువాయ్-10-7-10) ఇత్యాది పలు పాశురాలలో ఇంద్రియాలు భగవానునకు ప్రకారాలై, అతనికి అధీనంగా ఉంటాయని అనుసంధించారు, దివ్యసూరులు.

2. అతనిని తెలిసికొనే భక్తులకు అతడు మోక్షం అనుగ్రహిస్తాడు- అనేది "అణైవదు అరవణైమేల్", "శూళ్విశుమ్బు" ఇత్యాది తిరువాయ్మొళి దశకాలలో, "అవన్ నాడుమ్ నకరముమ్ నన్గుడన్ కాణ నలనిడై ఊర్ది పణ్ణి వీడుమ్ పెఱుత్తి త్తన్ మూవులకుక్కుమ్ తరుమ్ ఒరునాయకమే" (ఆ శ్రీకృష్ణుడు దేశంలో, పట్టణాలలో ఉండేవారు మంచిగా చూచేటట్లు శేషత్వమనే సంపదతో వర్తించేటట్లు చేసి, మోక్షాన్ని ఇచ్చి, తన ముల్లోకాల ప్రభుత్వాన్ని కూడా (ఇహలోకాధిపత్యాన్ని కూడా) ఇస్తాడు.) ఇత్యాది పాశురాలలో అనుసంధింపబడింది.

3. "ఎన్దైనుమ్ కట్కణ్ణాల్ కానాద అవ్వురువై" (ఏనాడు బాహ్యేంద్రియాలతో దర్శించలేని ఆ రూపాన్ని) (పెరియ తిరు-28), "కట్కిలీ" (బాహ్యేంద్రియాలకు కన్పించనివాడా!) (తిరువాయ్-7-2) ఇత్యాది పలు పాశురాలలో పరమాత్మ, ఇంద్రియ గోచరుడు కాడనే విషయాన్ని ఆళ్వార్లు తెలిపారు.

4. "యానుమేత్తి ఏఴులకుమ్ ముఱ్ఱుమేత్తి ప్పిన్నైయుమ్ తాను మేత్తిలుమ్ తన్నై యేత్తి వేత్త ఎజ్గెయ్దుమ్" (నేను కీర్తించి, ఏడు లోకాలన్నీ స్తుతించి, ఇంకా, తానుకూడా స్తుతించినా ఆ పరమాత్మ గొప్పతనం పూర్తి కాదు) (తిరువాయ్-4-3-10), "నిన్నై యార్ నినైక్కవల్లరే" (ఎవరు భావించగలరు?) (తిరుచ్చంద-1), "నినైయావర్ కాణవల్లరే" (తిరుచ్చంద-3,8), "ఒన్డిరణ్డు కణ్ణినాలుమ్ ఉన్నై యేత్తవల్లనే" (తిరుచ్చంద-7) (ముక్కంటి కూడా నిన్ను స్తుతించగలడా?) మొదలైన పలు పాశురాలలో భగవానుని పరిచ్ఛేదించి తెలియలేమని ఆళ్వార్లు అనుగ్రహించారు.



5. "కట్టురైక్కిల్ తామరై నిన్ కణ్పాదమ్ కైయొవ్వా, శుట్టురైత్త నన్పొన్ ఉన్ తిరువేని ఒళి ఒవ్వాదు, ఒట్టురైత్తు ఇవ్వులకున్నై ప్పుకళ్వెల్లామ్ పెరుమ్బాలుమ్ పట్టురైయాయ్ పుఱ్కెన్డే కాట్టుమాల్ పరఞ్జోతీ" (పరంజ్యోతి స్వరూపా! వివరించి పల్కితే- తామరపూవు నీ కన్నులకు, పాదాలకు సాటి రాదు, కాచి వడబోసిన బంగారం కూడా నీ దేహకాంతికి సరిపోదు. ఈలోకం నిన్ను చేసే స్తుతి అంతా ఇంచుమించుగా నీ నిందలోకే పర్యవసిస్తుంది.) (తిరువాయ్-3-1-2) ఇత్యాది పలు సందర్భాలలో ఉపమానాన్ని పల్కి పరమాత్మను గూర్చి ఉపదేశించడం సాధ్యం కాదని ఆళ్వార్లు తెలిపారు.

4. అన్యదేవ తద్విదితాదిథో అవిదితాదధి ।
ఇతి శుశ్రుమ పూర్వేషాం యే న స్తద్ వ్యాచచక్షిరే ॥

యే = ఏ పూర్వాచార్యులు, నః = మనకు, తత్ = ఆ పరతత్త్వాన్ని గూర్చి, వ్యాచక్షిరే = ఉపదేశించారో, పూర్వేషాం = ఆ పూర్వాచార్యుల వద్దనుండి, తత్ = ఆ పరతత్త్వాన్ని, విదితాత్ = (ఇంద్రియాలతో) తెలియబడే అచేతనం కంటే, అన్యత్ ఏవ = చాలా విలక్షణమైనదే, అథో = ఇంకా, అవిదితాత్= (ఇంద్రియాలద్వారా) తెలియబడని చేతనమైన జీవస్వరూపంకంటే, అధి= మిక్కిలి గొప్పది (పెద్దది), ఇతి = అని, శుశ్రుమ= వింటున్నాము.

అవ: "పూర్వమంత్రంలో పల్కినట్లుగా ఆ పరతత్త్వం తెలియరానిదే అయితే, అది అసద్వస్తువే కాగలదు. అటువంటి అసత్తును తెలియాలని ఆచార్యుల సన్నిధికి వెళ్ళడం మొదలైన కార్యాలు నిష్ప్రయోజనమే కాగలదు కదా" అనే ప్రశ్న రాగా, ఆ పరతత్త్వం ఇంద్రియాలతో తెలియబడే అచేతన వస్తువులకంటే చాలా విలక్షణమైనది- అని, ఇంద్రియాల ద్వారా తెలియరాని చేతనతత్త్వంకంటే చాలా విలక్షణమైనది-అని తెలియదగినది-అని పూర్వాచార్యులు ఉపదేశిస్తున్నారు-అని ఈ మంత్రం తెల్పుతున్నది.

**వ్యాఖ్య: (అన్యదేవ తద్విదితాత్)-** ఇంద్రియాలతో తెలిసికొనబడే అచేతనవస్తువుకంటే అది (పరతత్త్వం) స్వరూపంలో స్వభావంలో వేఱయినది. "విదితాత్" అనే ఏకవచనం జాత్యేకవచనమై, అచేతనాలను అన్నిటిని తెల్పుతున్నది. స్వరూపంలో సదా మార్పును పొందుతూ ఉంటుంది. జడమైన అచేతనవస్తువు. జ్ఞానానందస్వరూపమైన ఈ పరమాత్మ స్వరూపంలో ఎటువంటి మార్పును లేనిది. స్వభావంలో కూడా నైచ్యాన్ని, తక్కువదనాన్ని కల్గించే మార్పులను కల్గినది-అచేతన వస్తువు. ఈ పరతత్త్వం స్వభావంలో ఔన్నత్యాన్నే కల్గించే మార్పులను కల్గినది. ఈ విధంగా, అచేతనం కంటే పూర్తిగా విలక్షణమైనది అయినందున "విదితాత్ అన్యదేవ" (ఇంద్రియాలచే తెలియబడే అచేతనవస్తువుకంటే చాలా వేఱయినదే, ఈ పరతత్త్వం) అని 'ఏవ'కారం చేర్చి ప్రయోగింపబడింది. తరువాత, 'ఇంద్రియాల ద్వారా తెలియబడని జీవస్వరూపం కంటే గొప్పది, పరతత్త్వం" అని ఘోషింపబడుతున్నది.

**(అవిదితాత్ అధి)** ఇంద్రియాలతో తెలియలేని చిత్ అనే జీవ స్వరూపంకంటే చాలా గొప్పది. ఇక్కడ "అవిదితాత్" అనే పూర్వంవలె ఏకవచనం జాత్యేకవచనం. జీవస్వరూపం పరమాత్మ స్వరూపంవలె జ్ఞానమయమై ఉన్నా, అణుస్వరూపమై, పరమాత్మచే వ్యాపింపబడి, నియమింపబడేదై, ధరింపబడేదై, వినియోగింపబడేదై ఉంటుంది. పరమాత్మ స్వరూపం అంతటా వ్యాపించిన విభువై, జీవుని వ్యాపించి నియమించేదై, ధరించేదై, వినియోగించుకొనేదై ఉంటుంది కనుక, పరమాత్మ జీవుని కంటే చాలా గొప్పది-అని చెప్పబడుతున్నది. దీనివల్ల చిత్, అచిత్, వీటికి అంతర్యామియైన ఈశ్వరుడు-అనే మూడు తత్త్వాలను అంగీకరించే విశిష్టాద్వైతమతమే ఉపనిషత్ సిద్ధాంతమని వ్యక్తమవుతున్నది.



ఈ మంత్రంలో పూర్వార్ధానికి వేఱు రీతిలో కూడా అర్థాన్ని గ్రహించవచ్చు. గడచిన మంత్రంలో పల్కినట్లుగా, లౌకిక వస్తువులవలె, ఆ పరతత్త్వం ఉపదేశించడానికి సాధ్యం కానిది అయితే, దానిని ఏవిధంగా తెలిసికోవడం? అని అంటే,

**(అన్యదేవ తద్విదితాత్)-** ఆ పరమాత్మ తెలియబడే వస్తువుల కంటే చాలా విలక్షణమైదే. "ఆవిధంగా అయితే, శశశృంగం (కుందేటి కొమ్ము), గొడ్రాలి కొడుకు, ఆకాశపద్మం-మొదలైన వానివలె ఇది అసలు లేని వస్తువా? అంటే,

**(అవిదితాత్ అధి)-** తెలియబడని, అసలు లేని వస్తువులైన కుందేటికొమ్ము, వంధ్యాసుతుడు, ఆకాశపద్మం ఇత్యాదులకంటే ఇది విలక్షణమైనదే. ఈ విధంగా తెలియబడే వస్తువుల కంటే, తెలియబడని, లేని వస్తువుల కంటే విలక్షణమైనది-అని అనడంలో ఏమి తాత్పర్యం? అని అంటే, "ఇది ఇటువంటిది, ఇంతటిది" అని పరిచ్ఛేదించి, ఆ పరతత్త్వాన్ని తెలియడం సాధ్యం కాదు కనుక, దీనిని, తెలియని వస్తువుల కంటే విలక్షణమైనది-అని చెప్పవచ్చు. శాస్త్రాలలో ఏ విధమైన పరిచ్ఛేదం లేని, జ్ఞానానందమయమైన వస్తువు అని తెలియబడుతున్నందున,

తెలియబడని, కుందేటి కొమ్ము మొదలైనవానికంటే వేఱయినది-అని చెప్పవచ్చు. ఈ విధంగా, పరతత్త్వం పరిచ్ఛేదించి పలుకడానికి వీలు లేనిదో అని, మిగిలిన వస్తువులకంటే అన్యప్రమాణాలతో తెలియబడక, కేవలం (వేదరూప) శాస్త్రం ద్వారానే తెలియబడేది-అని చెప్పబడినట్లయినది. బ్రహ్మసూత్రాలలో **"శాస్త్రయోనిత్వాత్" (1-1-3) (శాస్త్రమనే ప్రమాణాన్ని మాత్రమే కలవాడు కనుక)** అనే సూత్రంలో ఈ అర్థం సూత్రకారునిచే వివరింపబడింది.

ఈ విషయం ఏవిధంగా తెలియబడింది? అనేది మంత్రంలోని ఉత్తరార్ధం తెలుపుతున్నది.

**(యే నః తత్ వ్యాచచక్షిరే)** - ఏ పూర్వాచార్యులు మాకు ఆ పరతత్త్వాన్ని గూర్చి ఉపదేశించారో,

**(పూర్వేషామ్)**- ఆ పూర్వాచార్యులవల్ల,

**(ఇతి శుశ్రుమ)**- ఈ విషయాన్ని మేము విని తెలిసికొన్నాము. "బ్రహ్మవాదినో వదంతి" మొదలైన సందర్భాలలో వలె వేదపురుషుడు తత్త్వజ్ఞానాన్ని కలవారి ఉపదేశాన్ని ప్రమాణంగా చూపుతున్నాడు.

**ఉభయవేదాంతసామ్యం:**

ఈ మంత్రంలో చిదచిత్తులకంటే పరమాత్మ చాలా విలక్షణుడని చెప్పబడింది. తిరువాయ్‌మొ*ழி*లోని ప్రథమదశకంలోనే "పొఱియుణర్వ వైయిలన్" అని ఇంద్రియాలతో తెలిసికొనబడే అచేతనవస్తువు కంటే పరమాత్మ చాలా విలక్షణుడని తెలుపబడింది. "మననక మల మఱ మలర్ మిశై యె*ழு*దరుమ్ మననుణర్వళవిలన్" (మనస్సులోని దోషాలు పోగా, వికసించి వృద్ధి చెందే మానస జ్ఞానంతో కూడా పరిచ్ఛేదించి



తెలియడానికి సాధ్యం కానివాడు) (2) అని యోగులచేత విషయసంగాన్ని వీడి సాక్షాత్కరింపబడే జీవాత్మకంటే పరిమాణంలో చాలా పెద్దవాడని చెప్పబడింది. ద్వితీయదశకంలోని నాల్గవ పాశురంలో కూడా "ఇల్లదు ముళ్ళదుమ్ అల్లదు అవనురు" (4) అని స్వరూపంలో వికారాన్ని కల అచేతవస్తువును "ఇల్లదు" అని నిర్దేశించి, స్వరూపంలో వికారం లేని చేతనవస్తువును "ఉళ్ళదు" అని నిర్దేశించి, ఈ రెండిటికంటే చాలా విలక్షణమైనది, పరమాత్మ స్వరూపం- అనే విషయాన్ని "అల్లదు అవనురు" అని తెలిపారు-ఆ*ழ்*వార్లు. ఈవిధంగా ఇంకా పలు దివ్యసూరి సూక్తులలో ఈ మంత్రార్థాన్ని దర్శించవచ్చు.

**5. యద్వాచానభ్యుదితం యేన వాగభ్యుద్యతే ।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే ॥**

యత్ = ఏ పరతత్త్వం, వాచా = వాక్కు అనే ఇంద్రియాలతో, అనభ్యుదితం = వ్యక్తం చేయబడడంలేదో, యేన = ఏ పరతత్త్వంలో, వాక్ = వాక్ అనే ఇంద్రియం, అభ్యుద్యతే = ప్రకాశిస్తున్నదో, తత్ ఏవ = అదే, త్వం = నీవు, బ్రహ్మమ్ = పరతత్త్వం అని, విద్ధి = తెలిసికో, యత్ = ఏ తత్త్వాన్ని, ఇదం = ఇది (అని), ఉపాసతే = (జనులు) దర్శిస్తున్నారో, (తత్) ఇదమ్ = (ఆ) ఈ లోకం, (బ్రహ్మమ్) న= పరబ్రహ్మం కాదు.

అవ: ఈ మంత్రంనుండి 9వ మంత్రంవరకు పరతత్త్వం చేతనాచేతనరూపమైన లోకంకంటే విలక్షణమైనది - అని ముందు మంత్రంలో చెప్పబడిన విషయమే వివరింపబడుతున్నది. ప్రతిమంత్రంలోను ఉత్తరార్ధం ఒకే రీతిలో ఉన్నది. పూర్వార్ధంలో పరతత్త్వం వాక్కు, మనస్సు, నేత్రం, చెవి, ప్రాణమనే ఉపకరణాలతో పరిచ్ఛేదించి తెలిసికోవడానికి సాధ్యం కానిది-అని, ఆ ఉపకరణాలు పరతత్త్వంవల్లనే

సత్తాస్థితి ప్రవృత్తులను పొందుతున్నాయని చెప్పబడుతున్నది.

**వ్యాఖ్య: (యద్వాచా అనభ్యుదితమ్)**- ఏ పరతత్త్వం వాక్కు ద్వారా ప్రకాశింపజేయబడడం లేదో-అని అర్థం. వాక్ అనే ఇంద్రియం పరబ్రహ్మను పరిచ్ఛేదించి వివరించలేదని భావం. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (తైత్తి-ఆనంద) (ఏ పరతత్త్వంనుండి వాక్కులు దానిని పరిచ్ఛేదించలేక వెనుకకు మరలుతున్నాయో) అని తైత్తిరీయోపనిషత్తులో చెప్పబడిందికదా! బృహదారణ్యకంలోని అంతర్యామి బ్రాహ్మణంలో కూడా ఇంద్రియాలు పరతత్త్వాన్ని తెలియలేవని చెప్పబడింది. సుబాలోపనిషత్తులోని అంతర్యామి బ్రాహ్మణం ఆ ఇంద్రియాలచే తెలియడానికి సాధ్యం కాని ఆ పరతత్త్వం నారాయణుడే-అని నిర్ణయించింది.

**(యేన వాక్ అభ్యుద్యతే)** -ఏ పరతత్త్వంచే వాక్కు ప్రకాశింపజేయబడుతున్నదో-అని అర్థం. ఈ మంత్రంలోని "వాక్" అనే పదం "వాక్" అనే ఇంద్రియాన్ని నిర్దేశిస్తున్నదని కూడా గ్రహించవచ్చు. లేక, వేదవాక్కును నిర్దేశిస్తున్నదని కూడా చెప్పవచ్చు. "యతో వాచో నివర్తంతే" (తైత్తి-ఆనంద) అని వేదవాగ్విషయంలో, "యో వాచి తిష్ఠన్ వాచోఽంతరః యం వాక్ న వేద యస్య వాక్ శరీరం యః వాచమంతరో యమయతి" (బృహ-5-7-21) (ఎవడు వాక్కులోపల, బయట వ్యాపించి ఉన్నాడో, ఎవనిని వాక్కు తెలియలేదో, ఎవనికి వాక్కు శరీరమో, ఎవడు వాక్కును దానిలోపల ప్రవేశించి ఉండి నియమిస్తున్నాడో) అని వాగింద్రియవిషయంలో కూడా ఈ విషయం స్పష్టంగా చెప్పబడింది.

**(యేన వాక్ అభ్యుద్యతే)**- ఎవనిచే ప్రేరేపింపబడి మానవులచే వాక్కులు ఉచ్చరింపబడుతున్నవో- అనే అర్థాన్ని కూడా గ్రహించవచ్చు.



**(తదేవ బ్రహ్మ త్వం విద్ధి)**- అదే బ్రహ్మమని నీవు గ్రహించు.

**(నేదం యదిద ముపాసతే)**- "ఇదమ్" (ఇది) అని ఇంద్రియాలచే తెలియబడేదిగా చేతనాచేతనాత్మకమైన లోకాన్ని జనులు చూస్తున్నారో, అది పరతత్త్వం కాదు. చేతనాచేతనాలతో కూడిన లోకం కంటే పరతత్త్వం విలక్షణమైనదని దీని తాత్పర్యం.

**6. యన్మనసా న మనుతే యేనాహుర్మనో మతమ్ ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిదముపాసతే ॥**

యత్ = ఏ పరతత్త్వాన్ని, మనసా = మనస్సు అనే ఇంద్రియంతో, న మనుతే = (ఎవడు) భావించి తెలియడంలేదో, యేన = ఏ పరతత్త్వంచే, మనః = మనస్సు, మతమ్ ఆహుః = తెలియబడినదిగా పల్కుతున్నారో, తత్ ఏవ = దానినే, త్వం = నీవు, బ్రహ్మ = పరతత్త్వమని, విద్ధి = గ్రహించు, యత్ = ఏ తత్త్వాన్ని, ఇదం = ఇది (అని), ఉపాసతే = (జనులు) చూస్తున్నారో, (తత్ = అది), ఇదం = (ఆ ఈ) లోకం, (బ్రహ్మ) న= పరతత్త్వం కాదు.

అవ: అన్ని ఇంద్రియాలను నియమించే మనస్సు పరతత్త్వాన్ని తెలియలేదని, మనస్సు పరతత్త్వంచే తెలియబడుతున్నదని ఇందులో తెలుపబడుతున్నది.

**వ్యాఖ్యానమ్: (యత్ మనసా నమనుతే)** - ఏ పరతత్త్వాన్ని ఏ మానవుడు కూడా మనస్సుతో తెలియలేడో-అని అర్థం. "కశ్చిదపి జనః" (ఏ మానవుడు) అనే శబ్దసందర్భాన్ని ఇక్కడ అధ్యాహరించుకోవాలి.

**(యేన మనో మతమ్)**- ఏ పరతత్త్వంచే మనస్సు తెలియబడుతున్నాడో-అని అర్థం. లేక, "మతమ్" అనే పదంలో "భావే క్తః" ప్రత్యయం వచ్చిందని తలిస్తే, ఏ పరతత్త్వంచే ప్రేరేపింపబడి మనస్సు

భావించే కార్యాన్ని చేస్తున్నదో-అనే అర్థాన్ని గ్రహించవచ్చు.

**(ఆహుః)**- అని ఈ విధంగా పూర్వాచార్యులు పల్కుతున్నారో-అని అర్థం. మంత్రంలోని ఉత్తరార్ధానికి పూర్వమంత్రంలో వలె అర్థాన్ని గ్రహించాలి.

7. **యచ్చక్షుషా న పశ్యతి యేన చక్షూంషి పశ్యతి ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే ॥**

యత్ = ఏ పరతత్త్వాన్ని, చక్షుషా = నేత్రంతో, న పశ్యతి = **(ఎవడూ)** చూడడంలేదో, యేన = ఏ పరతత్త్వంచే, చక్షూంషి = నేత్రాలు, పశ్యతి = చూస్తున్నవో, **(ఉత్తరార్ధానికి పూర్వమంత్రంలో వలె అర్థాన్ని గ్రహించాలి).**

**అవ:** నేత్రం పరతత్త్వాన్ని తెలియలేదని, పరతత్త్వంచే అది తెలియబడుతున్నదని ఇందులో చెప్పబడుతున్నది.

**వ్యాఖ్య: (యత్ చక్షుషా న పశ్యతి)** ఏ పరతత్త్వాన్ని నేత్రంతో ఎవడూ చూడడం లేదో-అని అర్థం. పరమాత్మను నేత్రం ఎపుడూ చూడడం లేదు. నేత్రమనే ఇంద్రియం పరతత్త్వాన్ని దర్శించగల్గిన శక్తిని కల్గినది కాదని తాత్పర్యం.

**(యేన చక్షూంషి పశ్యతి)**- ఎవనిచే కన్నులు చూడబడుతున్నాయో-అని అర్థం. "పశ్యతి" అనేదానికి "దృశ్యంతే" (చూడబడుతున్నాయి) అని అర్థం. బహువచనానికి బదులుగా ఏకవచనం ప్రయోగం, కర్మణి ప్రయోగానికి బదులుగా కర్తరి ప్రయోగముండడం ఛాందసం. లేక, "పశ్యతి" అనేది "పశ్యంతి" అనే బహువచనార్థాన్ని ఇచ్చేదైనపుడు, ఏ పరమాత్మచేత నేత్రాలు వస్తువులను చూస్తున్నాయో" అనే అర్థాన్ని గ్రహించవచ్చు. ఇక్కడ బహువచనానికి బదులుగా ఏకవచనం ఉండడం ఛాందసం. ఈ విధంగా - నేత్రాలచేత చూడబడనివాడై, మనకు అతీంద్రియమైన కన్ను అనే ఇంద్రియాన్ని చూచేవాడై, వాటికి చూచే శక్తిని ఇచ్చేవాడు పరమాత్మ-అనే అర్థం వస్తుంది. మంత్రంలోని ఉత్తరార్ధానికి పూర్వంవలె అర్థాన్ని గ్రహించాలి.



**అవ:** చెవి పరతత్త్వాన్ని తెలియలేదని, పరతత్త్వంచే తెలియబడుతున్నదని ఇందులో తెలుపబడుతున్నది.

8. **యత్ శ్రోత్రేణ శృణోతి**
**యేన శ్రోత్రమిదం శ్రుతమ్ ।**
**తదేవ బ్రహ్మ త్వం విద్ధి**
**నేదం యదిదముపాసతే ॥**

యత్ = ఏ పరతత్త్వాన్ని, శ్రోత్రేణ = చెవి ఇంద్రియంతో, న శృణోతి = **(ఎవడు)** ఎవడు వినడంలేదో, యేన = ఏ పరమాత్మచే, ఇదం = ఈ శ్రోత్రం = చెవి, శ్రుతమ్ = తెలియబడుతున్నదో.

**వ్యాఖ్య: (యత్ శ్రోత్రేణ న శ్రుణోతి)** ఏ పరతత్త్వాన్ని చెవితో ఎవనికీ విని తెలియడం సాధ్యం కాదో - చెవి అనే ఇంద్రియానికి పరతత్త్వాన్ని విని పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కాదో-అని తాత్పర్యం.

**(యేన శ్రోత్రమిదం శ్రుతమ్)**- ఏ పరతత్త్వంచే చెవి అనే ఈ ఇంద్రియం తెలియబడినదిగా అవుతున్నదో-అని అర్థం. లేక, "మనోమతమ్" అనే ప్రయోగంలోవలె చెవి అనే ఇంద్రియం ఏ పరతత్త్వంచే వినే శక్తిని పొందుతున్నదో-అని కూడా అర్థాన్ని గ్రహించవచ్చు. **(మంత్రంలోని ఉత్తరార్ధానికి పూర్వంవలె అర్థాన్ని గ్రహించవచ్చు).**

9. యత్ ప్రాణేన న ప్రాణితి యేన ప్రాణః ప్రణీయతే।
తదేవ బ్రహ్మ త్వం విద్ధి నేదం యదిద ముపాసతే ॥

యత్ = ఏ పరతత్త్వం, ప్రాణేన = ముఖ్యప్రాణంతో, న ప్రాణితి = జీవించడం లేదో, ప్రాణః = ముఖ్యప్రాణం, యేన = ఏ పరతత్త్వంచేత, ప్రణీయతే = ప్రేరేపింపబడుతున్నదో (ఉత్తరార్థానికి పూర్వం వలె అర్థాన్ని గ్రహించాలి)

అవ: ముఖ్యప్రాణం వల్ల పరతత్త్వం జీవించడంలేదని, పరతత్త్వం వల్లనే ముఖ్యప్రాణం ధరింపబడుతున్నదని ఇందులో చెప్పబడుతున్నది.

వ్యాఖ్య: (యత్ ప్రాణేన న ప్రాణితి) ఈలోకంలో ఉండే జీవులను జీవింపజేసే ముఖ్యప్రాణంచే ఏ పరతత్త్వం జీవించడంలేదో,

(యేన ప్రాణః ప్రణీయతే)- ఏ పరతత్త్వంచే ముఖ్యప్రాణం ధరింపబడుతున్నదో, లేక, ప్రేరేపింపబడుత్నుదో- అని అర్థం. ఇతరులను ధరింపజేసే ముఖ్యప్రాణాన్ని ధరింపజేసేవాడు పరమాత్మయే. ఇతరులను ఆయా కార్యాలలో ప్రేరేపించే ముఖ్యప్రాణాన్ని ప్రేరేపించేవాడు ఆ పరమాత్మయే-అని భావం. "ప్రాణ" అని ప్రాణవాయువు సంచరించే చోటైన ముక్కులో ఉండే ఘ్రాణేంద్రియాన్ని తెల్పుతుంది అని ప్రతిపదార్థదీపికావ్యాఖ్యలోని వివరణం. ముందు మంత్రాలలో ఇంద్రియాలు చెప్పబడినందున ఈ పదంకూడా ఇంద్రియాన్ని తెల్పుతుంది. అని దీని తాత్పర్యం. (మంత్రంలోని ఉత్తరార్థానికి పూర్వం వలె అర్థాన్ని గ్రహించాలి).

ఈ విధంగా ఈ అయిదు మంత్రాలవల్ల పరతత్త్వం ఇంద్రియాలద్వారా, ముఖ్యప్రాణంద్వారా సహాయాన్ని పొందడంలేదని, ఇంద్రియాలు, ముఖ్యప్రాణమే పరమాత్మవల్ల సత్తాస్థితి ప్రవృత్తులను



పొందుతున్నదని, దీనివల్ల పరమాత్మ లోకంలో ఉండే చేతనాచేతనాలకంటే విలక్షణమైనది-అని చెప్పబడినట్లయింది.

ఈ ఖండంలోని మంత్రాలను మధ్యస్థమైన (ఏ పక్షపాతం లేని) అభిప్రాయంతో గమనిస్తే, "బ్రహ్మాన్ని మాయ ఆవరించినందున జగత్తు అనే అసత్యమైన (మిథ్యారూపమైన) దర్శనం తోస్తున్నదని, జీవబ్రహ్మలిద్దరు వాస్తవానికి ఒకటే" అనే మాయావాదానికి కొంచెం కూడా ఈ మంత్రాలలో అవకాశం లేదని వ్యక్తమవుతుంది. మొదటి మంత్రంలో - ఇంద్రియాలు, ప్రాణం ఏ దేవునిచేత ప్రేరేపింపబడుతున్నాయి? అని ప్రశ్నింపబడింది. రెండవ మంత్రంలో ఇంద్రియాలను నియమించే హృషీకేశుడే అతడు - అని సమాధానం చెప్పబడింది. అతనిని తెలిసిన వారు ఈ లోకంనుండి విముక్తులై పరమపదంలో మోక్షాన్ని పొందుతున్నారని తెలుపబడింది. మూడవ మంత్రంనుండి తొమ్మిదవ మంత్రంవరకు ఇంద్రియాలచే అతడే పరిచ్ఛేదించి తెలిసికోవడానికి సాధ్యం కానివాడని, ఇంద్రియాలు మొదలైనవి అతని అధీనంలో ఉండేవే - అని, చేతనాచేతనాలతో కూడిన లోకం కంటే చాలా విలక్షణుడు అతడు- అని మాటిమాటికి విస్తరించి పలుకబడింది. ఈ విధంగా ఈ మొదటి ఖండంలో మాయావాదానికి ఏ మాత్రం చోటు లేదు - అని స్ఫుటంగా తెలుస్తున్నది.

**ఉభయవేదాంతసామ్యం :**

ఇక్కడ, ఇంద్రియాలు, ప్రాణం భగవానుని అధీనంలో ఉండేవి- అని వాటిచే అతడు తెలియ సాధ్యం కానివాడని చెప్పబడింది. "ఎన్టేనుమ్ కట్కణ్ణాల్ కాణాద అవ్వురువై" (ఏనాటికీ బాహ్యేంద్రియ గోచరం అని ఆ పరమాత్మరూపాన్ని,) (పెరియతిరువందాది-28) అని ఇంద్రియాలను

గోచరం కానివాడు, పరమాత్మ-అనే విషయాన్ని ఆళ్వార్లు తెలిపారు. "తున్ను కరచరణమ్ ముదలాక ఎల్లా వుఱుప్పుమ్ నీయే" (దృఢమైన కరచరణాది అంగాలు కూడా నీ అధీనంలోనే ఉన్నాయి) (తిరువాయ్-7-8-9) అని, "పొఙ్గెమ్బులనుమ్ పొఱియైన్దుమ్ కరుమేన్దిరియమ్... ఉన్ మామాయ!" (వృద్ధి చెందే జ్ఞానేంద్రియాలు, కర్మేంద్రియాలు అయిదు, పంచభూతాలు ... అన్నీ నీ అధీనంలో ఉన్నాయి.) (తిరువాయ్-10-7-10) అని, "అకఱ్ఱ నీ వైత్త మాయవల్ ఐమ్బులన్కళామవై" (నీకు దూరంచేసేటట్లుగా చేసే ఆశ్చర్యకరమైన, బలమైన పంచేంద్రియాలను) (తిరువాయ్-5-7-8) అని, ''శెవివాయ్ కణ్మూక్కు ఉడల్ అన్జైమ్బులనుమ్... ఏనమాయ్ నిన్ఱాన్క్కియల్వు" (చెవి, నోరు, కన్ను, ముక్కు, శరీరం, పంచేద్రియాలు... అన్నీ వరాహరూపాన్ని పొందిన భగవానునకు అధీనాలు) (ముదల్తిరు-12) అని ఆళ్వార్లు ఇంద్రియాలు మొదలైన అంగాలు భగవానునకు అధీనాలు-అని తెలిపారు.

## ద్వితీయఖండం

1. యది మన్యసే సువేదేతి దభ్రమేవాపి నూనం
త్వం వేత్థ బ్రహ్మణో రూపమ్ ।
యదస్య త్వం యదస్య దేవేషు అథ ను
మీమాంస్యమేవ తే మన్యే విదితమ్ ॥

(శిష్యుని ఉద్దేశించి ఆచార్యుడు పల్కుతున్నాడు)- సువేద= (నేను బ్రహ్మస్వరూపాన్ని), బాగా తెలిసికొన్నాను, ఇతి= అని, త్వం = నీవు, యది మన్యసే = భావిస్తున్నవాడవైతే, (అది), దభ్రమ్ ఏవ = అల్పమే, నూనమ్= (ఇది) నిశ్చయం, యత్ అస్య బ్రహ్మణః రూపమ్ = (రాముడు, కృష్ణుడు మొదలైన) ఈ లోకంలో ఉండే ఏ బ్రహ్మంయొక్క (విభవ) రూపాన్ని, వేత్థ ఇతి యది త్వం మన్యసే = తెలిసికొంటున్నాను- అని



నీవు భావిస్తే, (అదికూడా), దభ్రమ్ ఏవ నూనమ్ = అల్పమే అనేది నిశ్చయం, దేవేషు = (బ్రహ్మ, రుద్రుడు మొదలైన) దేవతలలో (ఒకడుగా) యత్ అస్య బ్రహ్మణః రూపమ్ = ఏ బ్రహ్మంయొక్క వ్యూహరూపాన్ని, వేత్థ ఇతి యది త్వం మన్యసే = తెలిసికొంటున్నాను-అని నీవు భావిస్తే, (అదికూడా), దభ్రమ్ ఏవ నూనమ్ = అది అల్పమే అనేది నిశ్చయం. (ఈ రూపాలు అన్నీ నీచే సరిగా తెలియబడలేదని భావం). అథ ను= ఇక మీదటనే, (బ్రహ్మస్వరూపాలు), తే = నీకు, మీమాంస్యమ్ = విచారించదగినవి, (దీనిని గూర్చి ప్రశ్నించి బ్రహ్మస్వరూపాలను చక్కగా తెలిసికొని శిష్యుడు పల్కుతున్నాడు), విదితం మన్యే= బ్రహ్మస్వరూపాలను గూర్చి తెలిసినట్లుగా (నేను) భావిస్తున్నాను.

అవ: బ్రహ్మస్వరూపం ఇదమిత్థంగా పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కానిది-అని గడచిన ఖండంలో పల్కిన అర్థాన్ని దృఢపరుస్తూ, అతని పలువిధాలైన రూపాలు కూడా అటువంటివే - అని ఈ ఖండంలోని ఈ మొదటి రెండు మంత్రాలలో ఆచార్య-శిష్య సంవాదరూపంగా వ్యక్తం చేయబడుతున్నది.

వ్యాఖ్యానమ్: మొదట, ఆచార్యుడు శిష్యుని ఉద్దేశించి ఈ క్రింది విధంగా పల్కుతున్నాడు.

**(సువేద ఇతి త్వం యది మన్యసే)**- బ్రహ్మస్వరూపాన్ని చక్కగా తెలిసికొన్నాను" అని నీవు భావిస్తే,

**(దభ్రమేవ నూనమ్)**- నీవు బ్రహ్మస్వరూపాన్ని అల్పమే తెలిసికొన్నావు - అనేది నిశ్చయం. పరిచ్ఛేదించి తెలియులేని బ్రహ్మస్వరూపాన్ని నీవు పూర్తిగా తెలిసికొన్నట్లుగా భావించినందున నీ జ్ఞానం అల్పమైనది - అని వ్యక్తమవుతున్నది - అని భావం. "ఇంద్రియాల

ద్వారా దర్శించడానికి సాధ్యం కాని బ్రహ్మస్వరూపం అయితే ఇటువంటిది కాదు. బ్రహ్మంయొక్క పలు విధాలైన రూపాలుకూడా ఈ విధంగా ఇంద్రియాలకు గోచరాలు అయేవి కావు" అని ఇక ఆచార్యుడు తెల్పుతున్నాడు.

**(యత్ అస్య బ్రహ్మణః రూపమ్)** - ఈ లోకంలో ఈబ్రహ్మం యొక్క రూపంగా (అడవిలోని వాగువలె) అపుడపుడు అవతరించిన రాముడు, కృష్ణుడు మొదలైన విభవరూపాలను గూర్చి (వాటిలో-ఆ అడవివాగుల నుండి తేటపడిన మడుగులవంటి) అర్చారూపాలను గూర్చి- అని అర్థం. "యత్" అని ప్రసిద్ధి స్ఫురించేటట్లు పల్కినందున, ఇది ఆయా కాలాలలో ప్రత్యక్షంగా ఈ లోకంలో కన్పించే విభవరూపాలను, అర్చారూపాలను తెలుపుతుంది.

**(వేత్థ ఇతి యదిత్వం మన్యసే)**- తెలిసికొన్నాను" అని నీవు భావిస్తే,

**(దభ్రమేవ నూనమ్)** - ఆ బ్రహ్మస్వరూపాలను గూర్చి నీవు అల్పమే గ్రహించావు-అనేది నిశ్చయం.

**(దేవేషు యత్ బ్రహ్మణః రూపమ్)**- బ్రహ్మ, రుద్రుడు మొదలైన దేవతల మధ్య అవతరించి ఉండే క్షీరాబ్ధినాథుడు మొదలైన వ్యూహరూపాలను గూర్చి,

**(వేత్థ ఇతి యది త్వం మన్యసే)**- తెలిసికొన్నాను అని నీవు తలిస్తే,

**(దభ్రమేవ నూనమ్)**- ఆ వ్యూహ రూపాలను గూర్చి నీవు అల్పమే గ్రహించావు-అనేది నిశ్చయం. "దేవేషు రూపమ్" అని అన్నందున "మధ్యే విరించి గిరిశం ప్రథమావతారః" (శ్రీరంగరాజస్తవమ్- ఉత్తరశతకమ్)



అనే రీతిలో బ్రహ్మరుద్రులనే దేవతల మధ్యలో "విష్ణువు" అనే తిరునామంతో అవతరించిన క్షీరాబ్ధినాథుడనే వ్యూహరూపాన్ని నిర్దేశిస్తుంది. పరరూపం ఈ లోకంలో ఉండే వారికి పూర్తిగా తెలియడానికి సాధ్యం కానిది అయినందున, అంతర్యామిరూపం యోగులకు తప్ప మిగిలినవారికి పూర్తిగా తెలియరానిది అయినందున వాటినిగూర్చి ప్రస్తావించలేదు. తైత్తిరీయనారాయణవల్లిలో "అంభస్య పారే" అని క్షీరాబ్ధినాథుడైన వ్యూహరూపం, "భువనస్య మధ్యే" అని ఈ లోకంలో అవతరించిన విభవరూపం, "నాకస్య మధ్యే" అని పరమపదంలోని పరరూపం, "శుక్రేణ జ్యోతీంషి సమనుప్రవిష్టః" అని తన శక్తితో బంగారం, వెండి మొదలైన తేజోద్రవ్యాలలో ప్రవేశించి నిలచి ఉండే అర్చావతారం, "గర్భే అంతః" అని అంతర్యామిరూపం ప్రస్తావింపబడడం, పురుషసూక్తంలో "త్రిపాదూర్ధ్వముదైత్ పురుషః" అని పరరూపం, "పాదోస్యేహాభవాత్ పునః" అని వ్యూహరూపం, "తతో విష్వఙ్ వ్యక్రామత్ సాశనానశనే అభి" అని చరాచరాలైన జీవులను ఉజ్జీవింపజేయడం కోసం అంతటా అవతరించిన విభవావతారరూపాలు, "ప్రజాపతిశ్చరతి గర్భే అంతః" అని అంతర్యామిరూపం, "అజాయమానో బహుధా విజాయతే" అని అన్ని అవతారరూపాలు ప్రస్తావింపబడడం ఇక్కడ అనుసంధేయం.

**(అథ ను మీమాంస్యమేవ)** - ఈ కారణాలవల్ల ఇక పైననే నీవు బ్రహ్మస్వరూపరూపాలనుగూర్చి విమర్శించి తెలియాలి - అని పల్కి ఆచార్యుడు తన మాటలను ముగించాడు. ఈ ఆచార్యసూక్తిని ఆలకించిన శిష్యుడు బ్రహ్మస్వరూప రూపాలను చక్కగా విమర్శించి చూచిన తరువాత ఆచార్యుని ఉద్దేశించి పల్కుతున్నాడు.

**(మన్యే విదితమ్)** - దీనికిముందు నేను బ్రహ్మస్వరూపాన్ని గూర్చి బాగా తెలియకపోయినా, ఇపుడు బాగా విచారించి చూచిన తరువాత

బ్రహ్మస్వరూపాలను చక్కగా తెలిసికొన్నట్లే భావిస్తున్నాను - అని.

ఇక్కడ మంత్రంలోని ఉత్తరార్ధానికి ఆనందభాష్యం కొంచెం భేదిస్తున్నది. పూర్వార్ధంలో "దభ్రమ్" అనేదానికి బదులుగా "దహరమ్" అనే పాఠం కన్పిస్తున్నది. అర్థం మాత్రం ఒకటే. ఉత్తరార్ధానికి అర్థం ఈ విధంగా ఉన్నది.

**(త్వమ్)**- నీ విషయంలో - అని అర్థం. సప్తమీ విభక్త్యర్థంలో, ఛాందస ప్రయోగమైనందున, ప్రథమావిభక్తి వచ్చింది.

**(అస్య బ్రహ్మణః రూపం యత్)**- ఈ పరబ్రహ్మం యొక్క ఏ స్వరూపం నీలో ఉంటూ నిన్ను నియమిస్తున్నదో,

**(అథ దేవేషు అస్య యత్ రూపమ్)**- దేవతలలోను ఈపరబ్రహ్మం యొక్క ఏ స్వరూపం నియమిస్తున్నదో - అని అర్థం. "అథ" అనే శబ్దం "అపి" అనే సముచ్చయార్థంలో వచ్చింది.

**(తే విదితమ్)**- నీచే తెలియబడిన ఆ బ్రహ్మస్వరూపం,

**(మీమాంస్యమేవ తు మన్యే)**- ఇపుడు విచారించదగినదే - అని భావిస్తున్నాను - అని అర్థం. మంత్రం అంతా ఈ భాష్యంలో ఆచార్యవాక్యంగా కన్పిస్తున్నది. అనంతమైన స్వరూపాన్ని కల బ్రహ్మం ఇపుడు నీచే పూర్ణంగా తెలియబడనందున బ్రహ్మం ఇంకా విచారించదగినదిగానే ఉన్నది - అని భావం. ఈ భాష్యంలో రూపశబ్దం స్వరూపాన్ని మాత్రం తెల్పుతుంది.

2. **నాహం మన్యే సువేదేతి నో న వేదేతి వేద చ।**
**యో నస్తద్వేద నో న వేదేతి వేద చ ॥**

అహం = నేను, సువేద ఇతి = (బ్రహ్మాన్ని) చక్కగా తెలిసికొన్నాను- అని, న మన్యే = భావించడం లేదు, న వేద ఇతి చ = (బ్రహ్మాన్ని) తెలియలేదు అని కూడా, నో మన్యే = తెలియను, వేద చ = అయినా, తెలిసికొన్నాను (అనే తలుస్తాను) (ఇందువల్ల "బ్రహ్మాన్ని గూర్చి సరిగా తెలియడంలేదు, పూర్తిగా తెలియలేదు-అనేది లేదు. ఏదో కొంచెం తెలిసికొన్నాను అని ఏర్పడుతుంది).



నః = బ్రహ్మచారులైన మామధ్య, నో న వేద వేద చ ఇతి = "పూర్తిగా తెలియలేదు - అనేది లేదు. ఏదో కొంచెం తెలిసికొన్నాను" అని నేను పలుకగా, తత్= అర్థంలోని వాస్తవాన్ని, యః వేద = ఎవడు తెలిసికొంటున్నాడో (అతడు), తత్ = ఆ బ్రహ్మాన్ని, వేద = తెలిసికొంటున్నాడు.

అవ: "విచారించిన తరువాత బ్రహ్మాన్నిగూర్చి నేను తెలిసికొన్నాను" అని పల్కిన శిష్యుని చూచి "ఏవిధంగా తెలిసికొన్నావు" అని ఆచార్యుడు ప్రశ్నించగా, శిష్యుడు పలికే బదులుగా ఈ మంత్రం అవతరించింది.

**వ్యాఖ్యానమ్: (అహం సువేదేతి న మన్యే)**- "నేను బ్రహ్మాన్ని గూర్చి చక్కగా తెలిసికొన్నాను" అని భావించడంలేదు.

**(న వేద ఇతి చ నో మన్యే)** - బ్రహ్మాన్ని పూర్తిగా (ఏమీ) తెలియలేదు - అని కూడా నేను అనుకోవడంలేదు.

**(వేద చ ఇతి మన్యే)** - అయినా, తెలిసికొన్నాను - అనే తలుస్తాను. ఇక్కడి "చ" కారం "తు" అనే అవ్యయంయొక్క అర్థాన్ని ఇస్తుంది. "బ్రహ్మాన్ని గూర్చి పూర్తిగా తెలిసికొన్నాను - అనేది లేదు. కొంచెం కూడా తెలియలేదు-అనేది లేదు. ఏదో కొంచెం తెలిసికొన్నాను-అని నేను పల్కిన అర్థంలోని వాస్తవాన్ని, ఎవడు తెలిసికొంటున్నాడో, అతడు.

**(తత్ వేద)** - ఆ బ్రహ్మాన్నిగూర్చి తెలిసికొంటున్నాడు - "బ్రహ్మాన్ని గూర్చి బాగా తెలిసికొన్నాను" అని నేను పల్కితే నా బ్రహ్మజ్ఞానం అల్పమే కాగలదు. అందువల్ల ఆ విధంగా నేను పల్కడం లేదు. పూర్తిగా తెలియలేదు - అని అంటే కూడా అది కూడా అసత్యవచనమే అవుతుంది. అందువల్ల, ఆ విధంగా కూడా నేను అనడంలేదు. బ్రహ్మాన్ని గూర్చి ఏదో కొంచెం తెలిసికొన్నాను-అనే పల్కుతున్నాను. అని ఈ మంత్రంలోని సారార్థం. బ్రహ్మం ఇదమిత్థంగా పరిచ్ఛేదించి పలుకడానికి సాధ్యం కానందున పూర్తిగా అంతా తెలియలేదు. అయినా, ఆచార్యులైన మీరు ఉపదేశించినట్లు బ్రహ్మాన్నిగూర్చి ఏదో కొంచెం తెలిసికొంటున్నాను-అని భావం.

ఈ మంత్రానికి ఆనందభాష్యం వేఱు రీతిలో సాగింది. గడచిన మంత్రంలో "బ్రహ్మస్వరూపం విచారించదగినదే" అని ఆచార్యుడు అనగానే, "జ్ఞానం లేనివాడై, శిష్యుడనైన నాకు బ్రహ్మస్వరూపాన్ని తెలిసి తెలియకపోయినా, గొప్ప జ్ఞానిగా పేరుపొందిన మీరు దానిని ఉపదేశించాలి" అని శిష్యుడు ప్రార్థించగా, ఆచార్యుడు బదులు ఇచ్చే రీతిలో ఈమంత్రం అవతరించింది.

**(అహం సువేద ఇతి న మన్యే)** - బ్రహ్మస్వరూపాన్ని చక్కగా తెలిసినవాడని లోకంలో ప్రసిద్ధి పొందిన ఆచార్యుడనైన నేను బ్రహ్మాన్ని చక్కగా పూర్తిగా తెలిసినవాడనని నన్ను అనుకోవడంలేదు. "అయితే మీరుకూడా బ్రహ్మస్వరూపాన్ని తెలియలేదా?" అని అంటే,

**(నో న వేద ఇతి)**- బ్రహ్మస్వరూపాన్నిగూర్చి నేను ఏమాత్రం తెలియలేదు - అని కూడా అనుకోవడంలేదు.

**(వేద చ)**- పరిచ్ఛేదించి తెలిసికోవడానికి సాధ్యమైనది కానందున



బ్రహ్మాన్ని గూర్చి పూర్తిగా తెలియలేదు. నా ఆచార్యులు ఉపదేశించిన రీతిలో తెలిసికొంటున్నాను.

**(నః యః తద్వేద సః నో తద్వేద)**- "తత్ వేద" అని పల్కిన తరువాత "ఇతి వక్తి" అనే రెండు పదాలను అధ్యాహరించుకోవాలి. బ్రహ్మజ్ఞానులని ప్రసిద్ధి పొందిన ఆచార్యులలో ఏ ఆచార్యుడు ఆ బ్రహ్మస్వరూపాన్ని "పూర్తిగా తెలిసికొన్నాను" అని పల్కుతున్నాడో, దానిని తెలియనివాడే - అని భావం.

**(యశ్చ న వేదేతి వక్తి స వేద)** - ఆచార్యులలో ఎవరు బ్రహ్మస్వరూపాన్ని తెలియలేదని అంటున్నారో, వారే దానిని తెలిసినవారు. పూర్తిగా తెలియడానికి సాధ్యం కానందున "బ్రహ్మస్వరూపాన్ని పూర్తిగా తెలియలేదు" అని పలికేవారే దానిని యథాతథంగా తెలిసినవారు. బ్రహ్మస్వరూపాన్ని బాగా తెలిసికొన్నాను - అని పలికేవాడు బ్రహ్మాన్ని పరిచ్ఛిన్నంగా తెలిసికొంటున్నాడు. అందువల్ల, వాస్తవానికి అతడు బ్రహ్మస్వరూపాన్ని తెలియలేదు - అని భావం. బ్రహ్మజ్ఞానుల విషయంలో కూడా ఇదే న్యాయం పొసగుతుంది.

**3. యస్యామతం తస్య మతం మతం యస్య న వేద సః ।**
**అవిజ్ఞాతం విజానతాం విజ్ఞాతమవిజానతామ్ ॥**

యస్య = ఏ బ్రహ్మజ్ఞానికి, అమతమ్ = (పరతత్త్వం) తెలియబడనిది అవుతున్నదో?, తస్య = ఆ బ్రహ్మజ్ఞానికే, మతం = (ఆ బ్రహ్మస్వరూపం చక్కగా) తెలిసినది అవుతున్నది, యస్య = ఏ బ్రహ్మజ్ఞానికి, మతం = (బ్రహ్మస్వరూపం) తెలియబడినదిగా తోస్తున్నదో, సః = అతడు, న వేద = దానిని తెలియనివాడే, విజానతాం = బ్రహ్మం ఇంతటిది-అని పరిచ్ఛేదించి తెలిసేవారికి, అవిజ్ఞాతం = (బ్రహ్మం)

తెలియనిదే అవుతుంది, అవిజానతామ్ = (బ్రహ్మం అపరిచ్ఛిన్నం కనుక పరిచ్ఛేదించి తెలిసికోవడానికి సాధ్యం కానిది అని తెలిసినవారికి, విజ్ఞాతం = అది చక్కగా తెలిసినది అవుతుంది.

అవ: పూర్వం రెండు మంత్రాలలో శిష్యాచార్య సంవాదరూపంగా వ్యక్తం చేయబడిన అర్థాన్ని ఇంకొక మారు పల్కుతూ ద్రఢీకరిస్తున్నాడు, వేదపురుషుడు.

**వ్యాఖ్యానమ్: (యస్య అమతమ్ తస్య మతమ్)** ఎవడు "పరతత్త్వం పరిచ్ఛేదించి తెలియరానిది" అని భావిస్తున్నాడో, అతడే దానిని సరిగా తెలిసినవాడవుతున్నాడు.

**(యస్య మతమ్)**- ఎవడు బ్రహ్మాన్ని పూర్తిగా తెలిసికొన్నట్లుగా భావిస్తున్నాడో,

**(సః న వేద)**- అతడు వాస్తవంగా పరతత్త్వాన్ని తెలియనివాడే అవుతున్నాడు. ఈ మంత్రం పూర్వార్ధంలో తెల్పిన ఈ అర్థాన్ని దృఢపరచడం కోసం ఉత్తరార్ధంలో అదే వేఱొక రీతిలో తెలుపబడుతున్నది.

**(విజానతామ్)**- "పరతత్త్వాన్నిగూర్చి నేను విశేషంగా తెలిసికొన్నాను" అని భావించేవారికి-అని అర్థం. పరతత్త్వం ఇంతటిది అని పరిచ్ఛిన్నంగా తెలిసికొంటున్నాను" అని భావించేవారికి - అని కూడా అర్థాన్ని గ్రహించవచ్చు.

**(అవిజ్ఞాతమ్)**- పరతత్త్వం తెలియబడనిదే కాగలదు.

**(అవిజ్ఞానతామ్)**- "బ్రహ్మం అపరిచ్ఛిన్నం కనుక దానిని పరిచ్ఛేదించి తెలియడం సాధ్యం కాదు" అని తెలిసేవారికి,

**(విజ్ఞాతమ్)**- యథాతథంగా తెలిసినది అవుతుంది-అని అర్థం.



ద్రఢీకరించడంకోసం మళ్ళీ మళ్ళీ పల్కినందున పునరుక్తి దోషం సంక్రమించదు. లేక, మంత్రం పూర్వార్ధంలో ప్రత్యక్షం కాకుండా అనుమాన ఆగమాలనే ప్రమాణాల వల్ల కల్గిన జ్ఞానాన్ని, ఉత్తరార్ధంలో ప్రత్యక్షం వల్ల కలిగే జ్ఞానాన్ని గూర్చి పల్కుతున్నది కనుక, పునరుక్తి లేదని సుబోధినీ వ్యాఖ్యలో తెలుపబడింది.

ఇంకొక రీతిలో కూడా ఉత్తరార్ధానికి అర్థాన్ని చెప్పవచ్చు.

**(విజానతామ్)**- శాస్త్రమూలంగా బ్రహ్మాన్ని (బ్రహ్మస్వరూపం అంతా తెలియడానికి సాధ్యం కానిది-అని) ఎవరు యథాతథంగా తెలిసికొంటున్నారో,

**(అవిజ్ఞాతమ్)**- వారు బ్రహ్మస్వరూపం పూర్తిగా తెలియడానికి సాధ్యం కానిది-అనే తెలిసికొంటున్నారు.

**(అవిజానతామ్)**- శాస్త్రమూలంగా ఎవరు బ్రహ్మ స్వరూపాన్ని యథాతథంగా తెలియలేదో,

**(విజ్ఞాతమ్)**- వారు బ్రహ్మస్వరూపాన్ని పూర్తిగా తెలిసినట్లుగా భావిస్తున్నారు-అని అర్థం. ఈ విధంగా అర్థాన్ని గ్రహించినపుడు పునరుక్తి లేదు. ఈ మంత్రంలో "అమతమ్" అని, "అవిజ్ఞాతమ్" అని పరతత్త్వాన్నిగూర్చి పల్కడాన్ని చూచి "బ్రహ్మస్వరూపం పూర్తిగా తెలియడానికి సాధ్యం కానిది" అని కొందఱు అర్థాన్ని పల్కుతున్నారు. "మతమ్" అని, "విజ్ఞాతమ్" అని ఈ మంత్రంలోనే బ్రహ్మం తెలియబడినదిగా చెప్పబడినందున ఆ అర్థం పొసగదు. అందుచేత పరతత్త్వం పరిచ్ఛేదించి తెలియ సాధ్యం కానిది" అనే తాత్పర్యాన్ని గ్రహించాలి. పరతత్త్వం ఏ మాత్రం తెలియడానికి సాధ్యం కానిది-అనే అర్థాన్ని గ్రహిస్తే, అది తుచ్ఛమవుతుంది. శాస్త్రాలు అటువంటి తత్త్వాన్ని

ఉపదేశించాలని, దానిని శరణు పొందాలని విధించడం అర్థరహితమే అవుతుంది. అందుచేత "బ్రహ్మం పరిచ్ఛేదించి తెలియరానిది" అనే మంత్రంలోని సారార్థం. ఇక్కడ ఈక్రింది శ్రీభాష్య జిజ్ఞాసాధికరణ శ్రీసూక్తి అనుసంధేయం.

"యస్యామతమ్ తస్య మతమ్", "అవిజ్ఞాతం విజానతామ్" ఇతి బ్రహ్మణః జ్ఞానవిషయత్వముక్తం చేత్, "బ్రహ్మవిదాప్నోతి పరమ్", "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" ఇతి జ్ఞానాన్మోక్షోపదేశో న స్యాత్" "అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేదచేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదు''రితి బ్రహ్మవిషయజ్ఞానాసద్భావసద్భావాభ్యామ్ ఆత్మనాశమాత్మ సత్తాం చ వదతి. అతో బ్రహ్మవిషయ వేదనమేవ అపవర్గోపాయం సర్వాః శ్రుతయః విదధతి. జ్ఞానం చ ఉపాసనాత్మకమ్. ఉపాస్యం చ బ్రహ్మ సగుణ మిత్యుక్తమ్. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" ఇతి బ్రహ్మణోऽనంతస్య అపరిచ్ఛిన్నగుణస్య వాఙ్మనసయో రేతావదితి పరిచ్ఛేదాయోగ్యత్వ శ్రవణేన బ్రహ్మ ఏతావదితి బ్రహ్మపరిచ్ఛేద జ్ఞానవతాం బ్రహ్మ అవిజ్ఞాతమ్, అమత మిత్యుక్తమ్, అపరిచ్ఛిన్నత్వాత్ బ్రహ్మణః, అన్యథా ''యస్యామతం తస్య మతమ్'', "విజ్ఞాత మవిజానతామ్" ఇతి మతత్వ విజ్ఞాతత్వవచనం తత్రైవ విరుధ్యతే" ("యస్యా మతంతస్యమతమ్", "అవిజ్ఞాతమ్ విజానతామ్" అనేవాక్యంలో "బ్రహ్మం పూర్తిగా తెలియవీలుకానిది" అని చెప్పబడింది- అని అంటే, "బ్రహ్మవిదాప్నోతి పరమ్" (తైత్తి-ఆనంద-1), (బ్రహ్మాన్ని తెలిసినవాడు గొప్ప ఫలాన్ని పొందుతున్నాడు), "బ్రహ్మవేద బ్రహ్మైవ భవతి" (ముండక-3-2-9) (బ్రహ్మాన్ని తెలిసినవాడు బ్రహ్మంవలెనే అవుతున్నాడు) అని బ్రహ్మాన్ని తెలిసినందువల్ల మోక్షం కల్గుతుందని పల్కడం అర్థరహితమే అవుతుంది. "అసన్నేవ స భవతి అసద్బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సంత మేనం తతో విదుః" (తైత్తి-ఆనంద-6) అనే శ్రుతివాక్యం బ్రహ్మాన్నిగూర్చిన జ్ఞానం లేకపోతే ఆత్మనాశం కల్గుతుందని, ఆ జ్ఞానం ఉంటే ఆత్మసత్త కల్గుతుందని పల్కింది. అందువల్ల బ్రహ్మాన్నిగూర్చిన జ్ఞానమే మోక్షోపాయమని అన్ని వేదవాక్యాలు విధిస్తున్నాయి. ఆ జ్ఞానం ఉపాసనారూపం. "ఉపాసింప బడే బ్రహ్మం కూడా గుణాలతో కూడినది- అని చెప్పబడింది. "యతో వాచో నివర్తంతే అప్రాప్య మనసా సహ" (తైత్తి-ఆనంద-9) (ఏ పరమాత్మనుండి మనస్సుతో పాటు వాక్కులు దానిని పూర్తిగా చేరలేక వెనుకకు మరలుతున్నాయో) అని బ్రహ్మం అపరిచ్ఛిన్న స్వరూపాన్ని కల్గినదై, అంతులేని గుణాలను కల్గినదై, వాక్కులకు, మనస్సుకు "ఇంతటిది" అని పరిచ్ఛేదించి తెలియరానిదిగా ఉన్నది-అని పల్కినందున "బ్రహ్మం ఇంతటిది" అని బ్రహ్మాన్ని పరిచ్ఛేదించి తెలియబడేదిగా తెలిసేవారికి బ్రహ్మం తెలియరానిదిగా, భావించడం సాధ్యం కానిదిగా ఉన్నది-అని చెప్పబడింది. బ్రహ్మం అపరిచ్ఛిన్నం కదా! ఈ విధంగా అర్థాన్ని గ్రహించకపోతే, "యస్యామతమ్ తస్య మతమ్", "విజ్ఞాతమవిజానతామ్" అని బ్రహ్మం భావింపబడేదిగాను, తెలియబడేదిగాను ఉన్నది-అని అక్కడే పల్కడం పొసగదుకదా) అని ఈ మంత్రం యొక్క అర్థాన్ని శ్రీభాష్యకారులు వివరించడం అనుసంధేయం.



శ్రీపరాశరభట్టర్ కూడా శ్రీరంగరాజస్తవంలో "అమతం మతం మతమథామతం... ఇతి రంగరాజ ముదజూఘుషత్ త్రయీ స్తుమహే వయం కిమితి తం న శక్నుమః" (పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కానివాడని తెలిసినవాడు పరమాత్మ తెలిసినవాడవుతున్నాడు, పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యమైనవాడని తెలిసినవాడు పరమాత్మను తెలియనివాడే అవుతున్నాడు-అని శ్రీరంగనాథునిగూర్చి వేదం పల్కింది. మనం అతనిని

ఏ విధంగా పరిచ్ఛేదించి స్తుతించడం? స్తుతించలేము) అని పరమాత్మ పరిచ్ఛేదించి తెలియడానికిగాని, స్తుతించడానికి గాని సాధ్యం కానివాడైనా, వారు వారు తమ బుద్ధికి శక్తికి తగినట్లు అతనిని స్తుతించడం గాని, తెలియడం కాని చేయవచ్చు-అని ఈ మంత్రంలోని అర్థాన్ని తెలిపారు.

ఈ మంత్రానికి ఆనందభాష్యం వేఱు విధంగా ఉన్నది. రెండవ మంత్రంలోఉత్తరార్ధంతో శ్రవణరూపజ్ఞానంతో బ్రహ్మస్వరూపాన్ని పూర్తిగా తెలియడానికి సాధ్యం కాదు-అని చెప్పబడింది. ఈ మంత్రంలో "మనస్సుతో, ధ్యానంతో బ్రహ్మాన్ని పూర్తిగా తెలియడం సాధ్యం కాదు" అని చెప్పబడుతున్నది.

**(యస్య అమతమ్)-** ఎవనికి బ్రహ్మమనేది మనసుతో పూర్తిగా తెలియడం సాధ్యం కాదు- అనే జ్ఞానం కల్గుతుందో,

**(తస్య మతమ్)** - ఆ జ్ఞానికి బ్రహ్మమననంతో తెలియబడినదే అవుతుంది. బ్రహ్మం అపరిచ్ఛిన్నం కనుక పూర్తిగా మనస్సుతో తెలియరానిది-అని తెలిసికొంటున్నాడు కదా అతడు.

**(యస్య మతమ్)-** ఎవనికి బ్రహ్మం మననంతో తెలియబడింది-అనే జ్ఞానం కల్గుతున్నదో,

**(స న వేద)** అతడు బ్రహ్మాన్ని మననంతో తెలిసికొన్నవాడు కాదు. బ్రహ్మం అనేది పరిచ్ఛేదించి తెలియసాధ్యం కానిది-అని అతడు తెలియలేదు కదా!

**(విజానతామ్ అవిజ్ఞాతమ్)** - బ్రహ్మమనేది నాచే చక్కగా ధ్యానించి సాక్షాత్కరించుకోబడింది" అని అభిమానించే వానికి అది బాగా ధ్యానించి సాక్షాత్కరించుకోబడినదికాదు. బ్రహ్మం అపరిచ్ఛిన్నం-కనుక దానిని పూర్తిగా సాక్షాత్కరించుకోవడమనేది సాధ్యంకాదు కదా!



**(అవిజానతామ్ విజ్ఞాతమ్)** - "బ్రహ్మమనేది నాచే పూర్తిగా ధ్యానించి, సాక్షాత్కరించుకొనబడలేదు" అని తెలిసినవానికి బ్రహ్మం పూర్తిగా సాక్షాత్కరించుకోబడినదే అవుతున్నది. బ్రహ్మం అపరిచ్ఛిన్నం అని అతడు తెలిసికొన్నాడు కదా.

**ఉభయవేదాంతసామ్యం:-** ఈ మంత్రంలో పరబ్రహ్మం యొక్క స్వరూపరూపగుణాలు పరిచ్ఛేదించి తెలియడానికి సాధ్యం కానివి - అని చెప్పబడింది. ఈ అర్థాన్ని తెలిపే ఆఴ్వార్ల సూక్తులు ప్రథమఖండంలోని మూడవ మంత్రం వ్యాఖ్యానం చివర ఉదాహరింపబడ్డాయి. వాటిని అక్కడ గమనించవచ్చు.

**4. ప్రతిబోధవిదితమమృత మమృతత్వం హి విందతే ।**
**ఆత్మనా విందతే వీర్యం విద్యయా విందతేఽమృతమ్ ॥**

ప్రతిబోధవిదితమ్ = స్వరూప నిరూపక ధర్మాలతో తెలియబడిన, అమృతం = బ్రహ్మస్వరూపం, అమృతత్వం = మోక్షాన్ని, విందతేహి = పొందుతున్నదికదా!, ఆత్మనా = పరమాత్మచే, వీర్యం = (బ్రహ్మవిద్య కల్గడానికి అనుగుణమైన) దార్ఢ్యాన్ని, విందతే = ఉపాసకుడు పొందుతున్నాడు, విద్యయా = బ్రహ్మవిద్యవల్ల, అమృతం = మోక్షాన్ని, విందతే = పొందుతున్నాడు.

అవ: బ్రహ్మం పూర్తిగా తెలియడానికి సాధ్యం కానిది అయితే, మోక్షం ఏ విధంగా సిద్ధిస్తుంది? అని శిష్యుని సందేహానికి ఆచార్యుడు ఈ మంత్రంలో బదులిస్తున్నాడు.

**వ్యాఖ్య: (ప్రతిబోధవిదితమ్)-** "బుద్ధ్యతే అనేన ఇతి బోధః" అనే వ్యుత్పత్తిద్వారా ఒక వస్తువును తెలియడంలో సహాయపడే దాని స్వభావం "బోధ" శబ్దంతో చెప్పబడుతున్నది. "ప్రతిబోధ" శబ్దం "ప్రతినియతో బోధః

" అనే వివరణం ద్వారా, ఆ వస్తువునకు మాత్రమే చెందిన (ప్రతినియతమైన) స్వభావాన్ని తెల్పుతున్నది. ఈ విధంగా "ప్రతిబోధ" శబ్దం, ఘటానికి ఘటత్వం వలె, స్వరూపనిరూపక ధర్మమై ఉండేదానిని తెల్పుతుంది. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తైత్తి-ఆనంద-1-1-1), "ఆనందో బ్రహ్మ" (తైత్తి-భృగు-6-1) మొదలైన బ్రహ్మస్వరూపాన్ని తెలిపే వేదవాక్యాలు దానికి సత్యత్వం (వికారరహితమై ఉండడం) జ్ఞానత్వం (స్వయంగా ప్రకాశించేదై ఉండడం), అనంతత్వం (దేశకాల వస్తుపరిచ్ఛేదాలను కల్గి ఉండకపోవడం), ఆనందత్వం (ఆనందరూపమై ఉండడం) మొదలైనవానినే స్వరూపనిరూపక ధర్మాలుగా చెప్పినందున అవి ఇక్కడ "ప్రతిబోధ" శబ్దంతో చెప్పబడుతున్నాయి. ఈ విధంగా "ప్రతిబోధవిదితమ్" అని అన్నందున బ్రహ్మాన్ని పూర్తిగా తెలియడం సాధ్యం కాకపోయినా, స్వరూపనిరూపక ధర్మాలను పురస్కరించుకొని దానిని కొంతవరకు తెలియవచ్చు-అని శిష్యుని సందేహానికి ఆచార్యుని సమాధానంగా ఏర్పడుతున్నది.

**(అమృతమ్)**- మరణం మొదలైన ఏ నైచ్యాలను (దోషాలను) లేనిదైన బ్రహ్మం,

**(అమృతత్వం విందతే హి)**- (తనను ఉపాసించేవానికి) మరణం లేని స్థితి అయిన మోక్షాన్ని పొందిస్తున్నదికదా. బ్రహ్మం పూర్తిగా తెలియడానికి సాధ్యం కానిది అయినా, దాని ప్రతినియతధర్మాల ద్వారా దానిని తెలిస్తే, ఆ విధంగా తెలిసినవానికి అది మోక్షాన్ని పొందిస్తుంది కదా! అందుచేత మోక్షసిద్ధికి ఏ కొఱత లేదు - అని భావం. "హి" అనే శబ్దం ఈ విషయం వేదాలలో ప్రసిద్ధమైనది-అని తెల్పుతుంది. కనుక, మంత్రంలోని పూర్వార్ధంలో శిష్యుని సందేహానికి పూర్ణమైన బదులు చెప్పబడింది. "విందతే" అనేది ఇక్కడ "పొందుతుంది" అనే అర్థాన్ని



కాకుండా, "పొందిస్తుంది" అనే అర్థాన్ని ఇస్తుంది. ఈ "విది" ధాతువులో "ణిచ్" అంతర్భవించి ఉన్నది. "తనను ఉపాసించేవానికి" అనే పదాలను ఇక్కడ అధ్యాహరించుకోవాలి. ఈ విధంగా కాకుండా, "సుబోధినీ" వ్యాఖ్యానంలో "ప్రతిబోధవిదితమ్" అనే దానివల్ల ప్రతినియతధర్మాలతో బ్రహ్మస్వరూపాన్ని చక్కగా తెలియవచ్చు- అని, "అమృతత్వం విందతే" అని అన్నందున ఈ విధంగా తెలిసినవాడు మోక్షాన్ని పొందుతున్నాడు- అనే అర్థం చెప్పబడింది. మోక్షాన్ని ఉపాసకుడు పొందే రీతిని మంత్రంలోని ఉత్తరార్ధం తెల్పుతున్నది.

**(ఆత్మనా వీర్యం విందతే)**- పరమాత్మవల్ల బ్రహ్మవిద్య ఉపాసించడానికి తగిన శక్తిని ఉపాసకుడు పొందుతున్నాడు. "స నో దేవః శుభయా స్మృత్యా సంయునక్తు" (తైత్తి-నారా-84) (ఆ దేవుడైన నారాయణుడు మనకు మంగళకరమైన స్మృతిరూపంలో ఉండే బ్రహ్మవిద్యను అనుగ్రహించాలి) అని చెప్పబడింది కదా! గీతలో శ్రీకృష్ణుడు కూడా "ప్రీతిపూర్వకం దదామి బుద్ధియోగం తం యేన మాముపయాంతి తే" (గీత-10-10) (నన్ను పొందడానికి సాధనమైన ఆ భక్తియోగాన్ని నేనే వారికి సంతోషంతో ఇస్తాను) అని ఈ విషయాన్నే తెలిపాడు.

**(విద్యయా అమృతం విందతే)** - ఈ విధంగా పరమాత్మయొక్క అనుగ్రహంతో పరవిద్య ఫలించిన పిమ్మట ఉపాసకుడు మోక్షాన్ని పొందుతాడు. అందుచేత, పరమాత్మ ప్రతినియత ధర్మాలద్వారా తెలియదగినవాడే-అని, ఆపరమాత్మ కృపతో పరవిద్య పూర్తిని పొంది, ఉపాసకుడు మోక్షాన్ని పొందడంలో ఏ అడ్డు లేనిదని శిష్యుని సందేహానికి ఆచార్యుడు బదులిచ్చినట్లయింది.

ఈ మంత్రానికి ఆనందభాష్యంలోని అవతారిక మిగిలిన వ్యాఖ్యానాలలోవలెనే ఉన్నా, మంత్రానికి చెప్పబడిన అర్థం మాత్రం భిన్నంగా ఉన్నది. గడచిన రెండు మంత్రాలలో "పరమాత్మ మనన ధ్యానాలతో పూర్తిగా పొందబడకపోయినా, ఆ బ్రహ్మం సత్యత్వం మొదలైన ప్రతినియత ధర్మాలతో కొంతవరకు తెలియడానికి సాధ్యమైనదే" అని తెలుపబడింది. ఈ మంత్రంలోని "ప్రతిబోధ" శబ్దం ధ్యానాన్ని తెల్పుతున్నందున శ్రవణమననాలను తెలిపే "శ్రుతమ్", "మతమ్" అనే శబ్దాలను అధ్యాహరించుకోవాలి. ఈ విధంగా "ఏ ఉపాసకునిచే శ్రవణ మనన ధ్యానాలద్వారా ప్రతినియత ధర్మాలతో మరణరహితమైన బ్రహ్మం తెలియబడుతున్నదో) ఆ ఉపాసకుడు మోక్షాన్ని పొందుతున్నాడు" అని అధ్యాహరించుకొని మంత్రంలోని పూర్వార్థానికి అర్థాన్ని గ్రహించాలి.

లేక, "బుద్ధ్యతే ఇతి బోధః, బోధే బోధే ప్రతిబోధః" అని తెలియబడేవస్తువు ప్రతిబోధశబ్దంతో చెప్పబడుతున్నదని చెప్పి,

"ప్రతిబోధః" శబ్దం "అటువంటి ప్రతివస్తువులోను" అనే అర్థాన్ని ఇచ్చేదై, "ప్రతిబోధవిదిత మమృతమ్" అని, "జ్యోతీంషి విష్ణుః భువనాని విష్ణుః" (విష్ణుపు- 2-12-38) అనే విధంగా "పరమాత్మ ఒక్కొక్క వస్తువులోని అంతర్యామియై ఉన్నందున అన్ని వస్తువులై ఉన్నాడు" అని తెలిసినవాడే పరమాత్మను తెలిసినవాడు-అని తెల్పుతున్నది-అని కూడా చెప్పవచ్చు. "అమృతత్వం హి విందతే" అనే ప్రయోగం ద్వారా "ఈ విధంగా తెలిసే ఉపాసకుడు మోక్షాన్ని పొందుతున్నారు" అని చెప్పబడుతున్నది.

ఇక మంత్రంలోని ఉత్తరార్థం. "ఆత్మనా" మనస్థైర్యమనే ధృతితో వీర్యం-వీర్యాన్ని, విందతే-పొందుతున్నాడు, విద్యయా-(దానివల్ల కలిగే) బ్రహ్మవిద్యతో, అమృతం-పరమాత్మ స్వరూపాన్ని, విందతే-పొందుతున్నాడు. (సాక్షాత్కరించుకొంటున్నాడు-అని అర్థం.) ధృతితో



మనస్సును నియంత్రించుకొని, విద్యను సంపూర్ణంగా పొంది, బ్రహ్మసాక్షాత్కారాన్ని పొందుతున్నాడు. దానివల్ల మోక్షప్రాప్తిని పొందుతున్నాడు-అని అర్థం. ఈ మంత్రం ద్వారా ఈ విధంగా శిష్యుని సందేహాన్ని ఆచార్యుడు తీర్చాడు.

ఈ మంత్రానికి ప్రపత్తిపరంగా కూడా అర్థాన్ని చెప్పవచ్చు. "అమృతం-అమృతత్వం, విందతే హి" అని అన్నందున మోక్షానికి నిరపేక్షోపాయమైన పరమాత్మయే ఈ చేతనునకు మోక్షాన్ని కల్గిస్తున్నాడు - అని చెప్పబడింది. అది ఏవిధంగా? అనే విషయాన్ని మంత్రంలోని తరువాతి భాగం తెల్పుతున్నది.

**(ఆత్మనా విందతే వీర్యమ్)** - "తస్మాన్న్యాసమేషాం తపసా మతిరిక్తమాహుః" (తైత్తి-నా-50) (అందువల్ల శరణాగతిని అన్ని తపస్సులలో గొప్పతపస్సుగా పల్కుతున్నారు) అనేవిధంగా గొప్పతపస్సు అయిన "భగవానుడే ఉపాయం" అనే ధృతి-మహావిశ్వాసం కలవాడై ఉండడమనే ప్రపత్తిరూపమైన జ్ఞానాన్ని పరమాత్మయొక్క అనుగ్రహంతో ఈ జీవుడు పొందుతున్నాడు.

**(విద్యయా విందతేమృతమ్)**- జ్ఞానాత్మకమైన ఆ శరణాగతితో మోక్షాన్ని పొందుతున్నాడు. "న్యాస ఇత్యాహుర్మనీషిణో బ్రహ్మాణమ్" (తైత్తి-నారా-50) (జ్ఞానులు న్యాస మని పరమాత్మను పల్కుతున్నారు) అనేవిధంగా భగవానుడే ఉపాయమనే మహావిశ్వాసమనే శరణాగతి రూపజ్ఞానాన్ని కల చేతనునకు భగవానుడు తన నిర్హేతుక కృపతో మోక్షాన్ని పొందిస్తున్నాడు-అనే అర్థం వేదాంతాలలో ప్రసిద్ధం-అనేది మంత్రంలోని సారార్థం. ఈ మంత్రం ఈ రీతిలో శిష్యుని సందేహం ఆచార్యుని ద్వారా స్పష్టీకరింపబడింది.

**ఉభయవేదాంతసామ్యం:** ఈ మంత్రంలో "ప్రతిబోధ విదితమమృతమ్" అని బ్రహ్మస్వరూపం దాని స్వరూపనిరూపక ధర్మాలద్వారా తెలియబడుతున్నది-అని తెలుపబడింది. "సత్యం జ్ఞానమనంతం బ్రహ్మ" (తైత్తి-ఆనంద-1-1-1) అని తెలుపబడిన సత్యత్వం, జ్ఞానత్వం, ఆనందత్వమనే మూడు విలక్షణధర్మాలు తిరుమంగై ఆళ్వార్ల ద్వారా "నందా విళక్కే అళత్తఱ్కరియాయ్" (ఆరిపోని దీపమా! అపరిచ్ఛేద్య స్వరూపా!) (పెరియతిరు-3-8-1) అనే మూడు పదాలద్వారా వివరింపబడింది. నమ్మాళ్వార్లు కూడా "తుక్కమిల్ ఞానచ్చుడరొళి మూర్త్తి" (దుఃఖ సంబంధంలేని జ్ఞానాన్ని కలవాడు, ప్రకాశించే తేజస్సును కలవాడు) (తిరువాయ్-3-10-9), "తళర్విన్టియే ఎన్ఱుమ్ ఎఙ్గుమ్ పరన్ద తనిముదల్ ఞానమొన్టాయ్" (సర్వదా, సర్వత్ర శ్రమలేకుండా వ్యాపించేవాడు, అద్వితీయమైన, ప్రధానమైన గొప్పజ్ఞానాన్ని కలవాడు) (తిరువాయ్-3-10-10), "ఉణర్ ముఴునలమ్" (పూర్ణంగా జ్ఞానానందస్వరూపుడు) (తిరువాయ్-1-1-2), "అల్లలిల్ ఇన్బమ్ అళవిఱన్దు" (దుఃఖసంబంధంలేని, అంతులేని ఆనందాన్ని కలవాడు) (తిరువాయ్- 3-10-8), "తోఱ్ఱుక్కేడవై ఇల్లవన్" (ఉత్పత్తి వినాశాలు లేనివాడు) (తిరువాయ్-3-6-6) అని ఈ మూడు అసాధారణ ధర్మాలతో ఆనందత్వం పలుచోట్ల వివరింపబడింది. "వడివాయ్ నిన్ వలమార్బినిల్ వాழ்కిన్టమఙ్గై" (అందమైన నీ తిరుమేనిలో కుడివైపున ఉండే లక్ష్మి) (తిరుప్పల్లాణ్డు-2), "తిరువుడైయడికళ్" (లక్ష్మిని కల స్వామి) (తిరువాయ్-1-3-8), "తిరువుక్కుమ్ తిరువాకియ శెల్వా" (లక్ష్మికి కూడా లక్ష్మి అయినవాడా!) (పెరియతిరు-7-7-1) మొదలైన పలుచోట్ల "హ్రీశ్చతే లక్ష్మీశ్చ పత్న్యౌ" (పురుషసూక్తమ్) అని చెప్పబడిన శ్రియఃపతిత్వమనే అసాధారణ ధర్మం ఆళ్వార్లచేత వివరింపబడింది. "అమృతత్వం హి



విందతే" అనేచోట చెప్పబడిన మోక్షప్రదత్వం, "వీడు ముదలామ్" (మోక్షం మొదలైన ఫలాలను ఇస్తాడు) (తిరువాయ్-2-8-1), "వానవర్ నాట్టైయుమ్ నీ కణ్డుకొళ్- ఎన్ఱు వీడుమ్ తరుమ్ నిన్ఱునిన్టే" ("పరమపదాన్ని కూడా-నీవు నిర్వహించు" అని పరమపదాన్ని కూడా నిదానించి ఇస్తాడు.) (తిరువాయ్-3-9-9), "అవావఱ్ఱువీడు పెఱ్ఱ కురుకూర్చ్చడకోపన్" (ఆర్తి తీరి పరమపదాన్ని పొందిన నమ్మాళ్వార్లు) (తిరువాయ్-10-10-11) అని పలుచోట్ల వివరింపబడింది. "భక్తిద్వారా మోక్షాన్ని పొందుతున్నాడు" అని మంత్రం ఉత్తరార్ధంలో చెప్పబడినది కూడా "పత్తుడైయడియవర్క్కెళియన్" (భక్తిని కలవారికి సులభుడు) (తిరువాయ్-1-3-1), "వణక్కుడై త్తవనెఱి వழிనిన్ఱు" (నమస్కరించడమనే భక్తిమార్గంలో నిలచి) (తిరువాయ్-1-3-5), "ఆదిపాల్ వత్తరామవర్ క్కలాదు ముత్తిముఱ్ఱలాకువే" (జగత్కారణమైన భగవాని పట్ల భక్తిని కలవారికి ముక్తి లభిస్తుంది) (తిరుచ్చంద-79) మొదలైన చోట్ల ఆళ్వార్లచే వివరింపబడింది. "శరణాగతివల్ల మోక్షాన్ని పొందుతున్నాడు" అనే ఈ మంత్రార్థం కూడా "నోఱ్ఱనోన్బు" (తిరువాయ్-5-7) అనే దశకం నుండి నాల్గు దశకాలలో, "అకలకిల్లేన్" (తిరువాయ్-6-10-10) మొదలైన పలు పాశురాలలోను తెలుపబడింది. "ప్రతిబోధవిదితమ్" అనే చోట "పరమాత్మ ఒక్కొక్క వస్తువులోను తెలియబడుతున్నాడు" అని తెలుపబడిన అర్థం కూడా "నిఱ్కిన్ట దెల్లామ్ నెడుమాల్" (ఈలోకంలో ఉన్నదంతా పరమాత్మ ప్రకారాలే) (నాన్ముకన్ తిరు-54) మొదలైన చోట్ల, తిరుచ్చందవిరుత్తంలో, తిరువాయ్మొழிలో, పెరియతిరుమొழிలో పలు పదార్థాలను పరమాత్మతో ఏకవిభక్తిలో పలికేచోట్ల చూపబడింది.

**5. ఇహ చేదవేదీ దథ సత్యమస్తి**
**న చేదిహా వేదీన్మహతీ వినష్టిః ।**
**భూతేషు భూతేషు విచిత్య ధీరాః**
**ప్రేత్యాస్మాల్లోకాదమృతా భవంతి ॥**

ఇహ అవేదీత్ చేత్ = ఈ మానవజన్మలో (ఒక జీవుడు పరతత్త్వాన్ని ఈ రీతిలో) తెలిసినట్లయితే, అథ = ఈ జన్మ పూర్తి కాగానే, సత్యమ్ అస్తి = నశించని ఫలం లభిస్తుంది, ఇహ = ఈజన్మలో, న అవేదీత్ చేత్ = (పరతత్త్వాన్ని) తెలియకపోతే, మహతీ వినష్టిః = గొప్పదైన ఆత్మనాశం కల్గుతుంది. ధీరాః = జ్ఞానులు, భూతేషు భూతేషు= అన్నిప్రాణులలో, విచిత్య= ఆ భూతాలకంటే గొప్పతనాన్ని కలవాడుగా పరమాత్మను తెలిసికొని, అస్మాత్ లోకాత్ ప్రేత్య= ఈ ప్రాకృతలోకం నుండి (అర్చిరాది గతిద్వారా) గొప్పగా పయనించి, అమృతా భవంతి = (అప్రాకృతమైన పరమపదంలో మరణం మొదలైన నైచ్యాలను పొందుతున్నాడు.

అవ: పూర్వం పల్కిన పరవిద్య, ఎపుడు సంపాదించదగినది? అనే ప్రశ్న రాగా, ఆచార్యుడు ఈ జన్మలోనే సంపాదించదగినది-అని అంటున్నారు. బ్రహ్మాన్ని తెలియడంలోని త్వరను ఆచార్యుడు ఉపదేశిస్తున్నాడని కూడా చెప్పవచ్చు.

వ్యాఖ్య: **(ఇహ అవేదీత్ చేత్)** - శాస్త్రాధికారాన్ని కల ఈ మానవజన్మలో ఈ పరతత్త్వాన్ని గూర్చి తెలిసినవాడయితే-అని అర్థం. “విది” ధాతువు ఉపాసనను గాని, శరణాగతి రూపజ్ఞానాన్ని కాని తెల్పుతుంది.

**(అథ)** త్వరలోనే- అని అర్థం. భక్తి అయితే ప్రారబ్ధ కర్మచివరలో- అని, ప్రపత్తి అయితే ఈ జన్మ చివరలో - అని అర్థాన్ని గ్రహించాలి.



**(సత్యమస్తి)**- నశించని ప్రయోజనమైన మోక్షం సిద్ధిస్తుంది. “అస్తి” (పరమపదంలో ఉజ్జీవనం) కల్గుతుంది. “సత్యమ్” ఇది సత్యం-అని ప్రతిపదార్థదీపికలోని వ్యాఖ్యానం. ‘అస్తి‘ - ఉన్నవాడుగా అవుతున్నాడు- అనే ప్రకాశికావ్యాఖ్యానం.

**(ఇహ న అవేదీత్ చేత్)**- ఇటువంటి మానవజన్మలో పరతత్త్వాన్ని తెలియనివాడై ఉంటే-

**(మహతీ వినష్టిః)**- గొప్ప ఆత్మనాశం కల్గి తీరుతుంది. శాస్త్రాధికారం లేని తిర్యక్స్థావర జన్మలలో జన్మించి సంసారపంకంలోనే మునిగి ఉండేటట్లుగా సంభవిస్తుంది-అని భావం. “అసన్నేవ స భవతి అసత్ బ్రహ్మేతి వేద చేత్, అస్తి బ్రహ్మేతి చేద్వేద సంతమేనం తతో విదుః ” **(తైత్తి-ఆనంద-6)** (బ్రహ్మజ్ఞానం లేకపోతే అతడు సత్తను లేనివాడే అవుతాడు. బ్రహ్మజ్ఞానం ఉంటే, ఆ కారణంవల్లనే అతనిని జ్ఞానులు సత్తను కలవానిగా తెలిసికొంటున్నారు) అని చెప్పబడింది కదా! ఈ విధంగా, మంత్రంలోని పూర్వార్థం ద్వారా “తరువాత చూచుకోవచ్చు” అని వేచి ఉండలేక బ్రహ్మజ్ఞానాన్ని పొందాలనే త్వరను పొందాలి-అని చెప్పబడింది. ఇక, ప్రపత్తిలో బ్రహ్మజ్ఞానం కలవారికి లభించే పరమపదప్రాప్తి వివరింపబడుతున్నది.

**(భూతేషు భూతేషు)** - ఒక్కొక్క వస్తువులోను పరమాత్మను దర్శించి-అని అర్థం. కన్పించే అన్ని వస్తువులలో అంతర్యామి అయిన శ్రీమన్నారాయణుని చూచి-అని తాత్పర్యం.

**(విచిత్య)** - ధార్యమై, నియామ్యమై, శేషమై, శరీరమైన ఆ భూతాలకంటే ధారకుడై, నియమించేవాడై, శేషియై, ఆత్మ అయిన

పరమపురుషుడు. విలక్షణుడని నిశ్చయించి-అని అర్థం. "విచింత్య" అని ప్రతిపదార్థదీపికలోని పాఠం. "ఒక్కొక్క భూతంలో ఉండే పరమాత్మను, తనకంటే విలక్షణుడైన అన్నిటి కంటే విలక్షణుడని తెలిసికొని-అని అర్థం.

**(ధీరాః)**- "ధీమతామగ్రేసరాః" జ్ఞానులలో గొప్పవారు-పరమాత్మను ఈ విధంగా తెలిసినవారే గొప్పజ్ఞానులు-అని భావం. "ధియా రమంత ఇతి ధీరాః" అనే వ్యుత్పత్తిని గ్రహించి, ఆత్మతత్త్వాన్ని యథాతథంగా తెలిసేవారు-అని సుబోధినీవ్యాఖ్యలో అర్థం చెప్పబడింది.

**(అస్మాత్ లోకాత్)**- ఈప్రాకృతమైన లీలావిభూతినుండి,

**(ప్రేత్య)**- గొప్పగా బయలుదేరి వెళ్ళి-శ్రుతిస్మృతులలో పఠింపబడే అర్చిరాది గతిద్వారా వెళ్ళి-అని భావం.

**(అమృతా భవంతి)**- అప్రాకృతమైన పరమపదంలో పరమపురుషుని పొంది, మరణం, జన్మం, వ్యాధి, వార్ధకం మొదలైన నైచ్యాలు లేని ముక్తులవుతున్నారు. దీనినిబట్టి అద్వైతులు పలికే జీవన్ముక్తి ఈ ఉపనిషత్తులో ఆదరింపబడలేదు-అని, ఒక్కొక్క వస్తువులో, దానికంటే విలక్షణునిగా ఉండే పరమాత్మను దర్శించినందున అర్చిరాదిగతి ద్వారా పరమపదంలో పరమపురుషుని పొంది, ప్రాకృతమైన సుఖాలు తీరి, మహానందాన్ని పొందడమే మోక్షమనే విశిష్టాద్వైత శ్రీవైష్ణవ సిద్ధాంతమే ఈ ఉపనిషత్తులోని సిద్ధాంతమని తెలుస్తున్నది.

**ఉభయవేదాంతసామ్యం:-** "బ్రహ్మజ్ఞానం ఉన్నట్లయితే పరమపురుషుని పొంది మహానందాన్ని పొందవచ్చు. లేకపోతే, సంసారపంకంలోనే పడి జీవుడు మునిగి జన్మ-మరణాది క్లేశాలలోనే పరిభ్రమిస్తాడు" అని ఈ మంత్రంలో చెప్పబడింది. "వీడుమిన్" **(తిరువాయ్-1-2), "శొన్నాల్" (తిరువాయ్-3-9), "ఒరునాయకమ్" (4-1), "కొణ్డపెణ్డిర్"- (తిరువాయ్-9-1)** మొదలైన దశకాలలో ఈ విషయంలో నమ్మాళ్వార్లచే విస్తృతంగా తెలుపబడింది. మిగిలిన ఆళ్వార్లు కూడా దీని పలు చోట్ల వివరించారు.



## తృతీయఖండం

**1. బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే, తస్యహ బ్రహ్మణో విజయే దేవా అమహీయంత. తే ఐక్షంత, అస్మాకమేవాయం విజయోస్మాకమేవాయం మహిమేతి.**

### ప్రవేశిక

ఈ ఉపనిషత్తులోని మొదటి రెండు మంత్రాలలో పరమాత్మచే ప్రేరేపింపబడే ఇంద్రియాలు, వాటి జీవుడు ప్రవర్తిస్తున్నాయి-అని, ఆ పరమాత్మ పరిచ్ఛేదించి తెలియలేనివాడు-అని, విలక్షణస్వభావాలతో అతనిని తెలిసినందున జీవుడు మోక్షాన్ని పొందుతాడని చెప్పబడింది. సాధారణ మానవుడు మాత్రమేకాదు. విశేషశక్తిని కల్గిన దేవతలు కూడా పరమాత్మచే అనుగ్రహింపబడిన శక్తితోనే తమ తమ కర్మలను నిర్వహిస్తున్నారని తెలుపడంకోసం ఈ ఖండంలో ఒక వృత్తాంత్తం చూపబడుతున్నది.

**అవ:** మొదటి మంత్రంలో పరబ్రహ్మం దేవతలకోసం అసురులను జయించినపుడు దేవతలు దానిని పరబ్రహ్మవిజయమని తెలిసికోలేకుండా, గొప్పతనంతో తాము పొందిన విజయమే ఇది-అని భ్రమించారు-అని తెలుపబడుతున్నది.

**వ్యాఖ్య: (బ్రహ్మ హ దేవేభ్యో విజిగ్యే)**- పరబ్రహ్మం ఒకానొక సమయంలో దేవతలకోసం అసురులను జయించాడు. "హ" అనేది

శ్రుతిప్రసిద్ధిని తెల్పుతున్నది. ఏ శ్రుతిలో ఏవిధంగా ప్రసిద్ధి ఉన్నది? అని అంటే, "విష్ణుముఖా వై దేవా శ్ఛందోభి రిమాన్ లోకాన్ అనపజయ్య మజనయన్" (యజు-1-7,5-2) (విష్ణువును నాయకునిగా కల దేవతలు ఛందస్సులద్వారా ఈలోకాలను, ఇతరులు జయించలేని రీతిలో, జయించారు) మొదలైన వేదవాక్యాలలో, వృత్రాసుర వధను వివరించే పలు వేదవాక్యాలలోను ఇది ప్రసిద్ధంకదా! అందువల్ల ఇక్కడ చెప్పబడే బ్రహ్మం విష్ణువే అయిఉండాలి. త్రిపురసంహారం చేసిన రుద్రుడు కాకూడదా? అంటే, దేవతలవద్ద "నేను పశుపతిని కావాలి" అని అర్థించి, వారివద్ద నుండి వరాన్ని పొంది, వారి సహాయంతో ఇతడు త్రిపురసంహారాన్ని చేశాడు-అని యజుర్వేదంలో (సంహిత-6-2) వివరింపబడినందున ఇతడు (దేవతలకోసం అసురులను జయించినవాడు) రుద్రుడు కాబోడు. (ఇంతేకాక, పలు బ్రాహ్మణాలను చూపి ఈ విషయాలను అన్నిటిని మేము విష్ణుచిత్త విజయగ్రంథం-ప్రథమాధ్యాయం, మూడు, నాల్గు పాదాలలో వివరించాము. అక్కడ గమనించండి.)

**(బ్రహ్మ హ దేవేభ్యోవిజిగ్యే)**- దేవతలను అనుగ్రహించడం కోసం పరమపురుషుడు అసురులను జయించాడు-అని మిగిలిన ప్రమాణాలనుబట్టి పదాలను అధ్యాహరించుకొని అర్థాన్ని చెప్పాలి.

**(విజిగ్యే)**- దేవతలకు అంతర్యామియై ఉండి, వారికి ఫలాన్ని అనుగ్రహించి, వారిని సహాయంగా చేసికొని అసురులను పరమపురుషుడు జయించాడు-అని భావం. "హ" అనే శబ్దం నిశ్చయాన్ని తెల్పుతుందని ఆనందభాష్యం.

**(తస్య హ బ్రహ్మణో విజయే దేవా అమహీయంత)**- పైపైన చూచినపుడు, దేవతలందఱు కలసి అసురులను జయించినట్లు తోచినా, దేవతలకు ఫలాన్ని అనుగ్రహించేవాడు హృషీకేశుడైనందున, వాస్తవానికి పరమపురుషుని ఆ విజయాన్ని చూచి దేవతలు అందఱిచే పూజింపబడ్డారు.

**(అమహీయంత)**- "తమ మహిమ" అని భావించి అహంకరించారు-అని ఆనందభాష్యం. ఇక్కడ "హ" శబ్దం వాస్తవానికి ఇది పరమాత్మ విజయంకాగా, దీనిని దేవతలు తమ విజయంగా పల్కుతున్నారే!-అనే ఆశ్చర్యాన్ని తెల్పుతున్నది. ఈ అహంకారంతో దేవతలకు కల్గిన భ్రాంతి ఇకపై తెలుపబడుతున్నది.

**(త ఐక్షంత అస్మాకమేవాయం విజయః, అస్మాకమేవాయం మహిమా ఇతి)**- ఆ ఇంద్రుని నాయకునిగా గల దేవతలు ఈ జయం తమదే, దానికి కారణమైన శక్తి కూడా తమదే-అని తలచారు. "మహిమా" అని ఇతరుల పొగడ్తను తెల్పుతున్నదని కూడా చెప్పవచ్చు. తరువాత, ఇంద్రుని నాయకునిగా కల దేవతలనే ప్రస్తావించినందున, ఇక్కడ ఇంద్రాది నాయకునిగా కల దేవతలనే ప్రస్తావించినందున, ఇక్కడ ఇంద్రాదిదేవతలు చెప్పబడుతున్నారు-అని తెలుస్తున్నది. ఎక్కువ దురభిమానాన్ని కల వీరు జీవులే-అని దీని వల్ల వ్యక్తమవుతున్నది.

**2. తద్ధైషాం విజజ్ఞౌ, తేభ్యో హ ప్రాదుర్బభువ తన్న ।**
**వ్యజానత (ంత) కిమిదం యక్షమితి ॥**

తత్ = ఆ పరబ్రహ్మం, ఏషాం తత్ = వీరి అహంకారాన్ని, విజజ్ఞౌ హ = తెలిసినదికదా, తేభ్యః = ఆ దేవతలకు అహంకారాన్ని పోగొట్టి, అనుగ్రహించడంకోసం, ప్రాదుర్బభూవ హ = వారిముందు (ఒక యక్షుని రూపంలో) ఆవిర్భవించి, తత్ = (ఆవిధంగా ప్రత్యక్షమైన) ఆ

బ్రహ్మాన్ని, కిమ్ ఇదమ్ యక్షమ్ ఇతి న వ్యజానంత = ఈ యక్షరూపం ఎవరు? అనే దానిని దేవతలు తెలిసికోలేదు.

అవ: దేవతల ఈ అహంకారాన్ని పోగొట్టడంకోసం బ్రహ్మం ఒక యక్షుని రూపంలో ప్రత్యక్షం కావడం, ఆ దేవతలు ఆ యక్షుని బ్రహ్మమని తెలియకపోవడం రెండవ మంత్రంలో చెప్పబడుతున్నది.

వ్యాఖ్య: **(తత్)** సర్వజ్ఞమైన ఆ పరతత్త్వం,

**(ఏషాం విజజ్ఞౌ హ)** వీరి ఆ అహంకారాన్ని తెలిసికొన్నది కదా. "తత్" అనే దానిని "ఏషామ్" అనే దానికి తరువాత అన్వయించాలి.

**(తేభ్యః ప్రాదుర్బభూవ హ)** - ఆ బ్రహ్మం ఆదేవతలకు ఆ అహంకారాన్ని పోగొట్టి, తనను గూర్చి జ్ఞానాన్ని కల్గించి, అనుగ్రహించడం కోసం వారిముందు, ఒక యక్షరూపిగా ఆవిర్భవించింది.

**(తత్ కిమిదం యక్షమితి న వ్యజానత)**- ఆ విధంగా స్ఫురించిన ఆ పరబ్రహ్మాన్ని చూచిన దేవతలే అది ఎవరు? అనే విషయాన్ని తెలిసికోలేకపోయారు. తమకు జయాన్ని కల్గించిన బ్రహ్మమే అది- అనే దానిని అహంకారంవల్ల, కలుషితులైన వారు తెలియలేదు.

**3,4. తేగ్ని మబ్రువన్, జాతవేదః! ఏతద్విజానీహి
కిమేతద్యక్షమితి, తథేతి, తదభ్యద్రవత్
తమభ్యవదత్ కోసీతి. అగ్నిర్వా అహమస్మీ-
త్యబ్రవీత్, జాతవేదా వా అహమస్మీతి.**

తే = ఆదేవతలు, అగ్నిమ్ = అగ్ని ఉద్దేశించి, అబ్రువన్ = పలికారు, హే జాతవేదః = ఓ అగ్నిదేవా!, ఏతత్ = మాముందుండే ఈ, యక్షం = యక్షుడు, కిమ్ ఇతి = ఎవరు? అని, ఏతత్ = ఈ విషయాన్ని, విజానీహి = బాగా తెలిసికొనిరా (అని), తథా ఇతి= ఆ విధంగానే (తెలిసికొంటాను) అని పల్కి, తత్ అపి = ఆ యక్షుని గూర్చి, అద్రువత్ = (అగ్ని) వెళ్ళాడు, తం = ఆ అగ్నిని గూర్చి, కః అసి ఇతి = నీవెవరు? అని, అభ్యవదత్ = (యక్షుడు) ప్రశ్నించాడు, (దానికి అగ్ని), అహం = నేను, అగ్నిః వై అస్మి = అగ్ని అనే పేరును కలవాడనై ఉన్నాను, ఇతి = అని, అహం = నేను, జాతవేదాః వై అస్మి= జాతవేదస్ = అనే పేరును కలవాడనై ఉన్నాను- అని, అబ్రవీత్ = అన్నాడు.



అవ: ఇందులో, "తథేతి" అనే పర్యంతం గల మూడవ మంత్రంలో దేవతలు యక్షుని తెలిసికొని రమ్మని అగ్నిదేవుని పంపించడం, తరువాత, నాల్గవ మంత్రంలో అగ్నిదేవుడు యక్షునిచే "నీవెవరు?' అని ప్రశ్నింపబడి తనను పరిచయం చేసికోవడం తెలుపబడుతున్నవి.

వ్యాఖ్య: **(తే అగ్నిమ్ అబ్రువన్)**- ఈ విధంగా పరమాత్మయే యక్షునిగా వచ్చాడు- అనే విషయాన్ని తెలియని ఆ దేవతలు అగ్నిదేవుని ఉద్దేశించి పలికారు. ఏమని అన్నారు? అంటే,

**(జాతవేదః కిమేతత్ యక్షమ్ ఇతి ఏతత్ విజానీహి)** - అగ్నిదేవా! ఈ యక్షుడెవరు? అనే విషయాన్ని నీవు వెళ్ళి తెలిసికొనిరా- అని అన్నారు. అగ్ని దానిని అంగీకరించడం ఇకపై తెలుపబడుతున్నది.

**(తథా ఇతి)**- "ఆ విధంగానే నేను వెళ్ళి యక్షుని తెలిసికొని వస్తాను" అని అగ్నిదేవుడు అన్నాడు. "అద్రవత్" అనే పదం "ద్రు-గతౌ" అనే ధాతువునుండి పుట్టినది కనుక "వెళ్ళాడు" అనే అర్థాన్ని ఇస్తుంది. యక్షుని దగ్గరకు వెళ్ళి అగ్నిని గూర్చి యక్షుడు అడిగిన ప్రశ్నను తరువాత వాక్యం తెల్పుతున్నది.

**(కః అసి ఇతి అభ్యవదత్)** - ఆ అగ్నిని చూచి యక్షుడు "నీవెవరు?" అని అడిగాడు.

ఇక, నాల్గవ మంత్రంలో చివరి వాక్యం అగ్ని పల్కిన బదులును తెల్పుతున్నది.

**(అగ్నిర్వై అహమస్మి ఇతి జాతవేదాః వై అహమస్మి ఇతి అబ్రవీత్)**- "నేను అగ్ని అనే పేరును కలవాడనై ఉన్నాను" అని, "నేను జాతవేదస్ అనే పేరును కలవాడనై ఉన్నాను" అని అగ్ని బదులిచ్చాడు- తన గొప్పతనాలను అన్నీ స్ఫురించేటట్లు అహంకారంతో తన రెండు పేర్లను అగ్ని పలికాడని భావం. "అగ్రం నయతి ఇతి అగ్నిః" అనే వ్యుత్పత్తి ద్వారా (దేవతలకు సమర్పించబడే హవిస్సులను) పైకి తీసుకొనిపోయేవాడు, అందువల్ల అగ్ని అని అనబడుతున్నాడు" అనేది అగ్నిశబ్దార్థం. "జాతం వేత్తి" ఇతి జాతవేదాః"- అనే వ్యుత్పత్తి ద్వారా "పుట్టిన దానిని అంతటిని తెలిసినవాడు" అనేది "జాతవేదాః" అనే శబ్దానికి అర్థం. అగ్నిశబ్దంతో తాను సర్వసమర్థుడనని, "జాతవేదాః", అనే శబ్దంతో తాను అన్నీ తెలిసినవాడనని అగ్ని అభిమానించిన (అహంకరించిన) రీతిని తెలుపుతున్నది. "వై" అనే పదం రెండు చోట్ల లోకంలో తాను ప్రసిద్ధిని పొందగా, నన్ను నీవు "ఎవరు?" అని అడుగుతున్నావే!-అనే నిందను కూడా ఈ వాక్యం స్ఫురింపజేస్తున్నది.

5. **తస్మింస్త్వయి కిమ్ వీర్యమితిః, అపీదం సర్వం దహేయం
యదిదం పృథివ్యామితి- (5)**

6. **తస్మైతృణం నిదధౌ ఏతద్దహేతి
తదుపప్రేయాయ సర్వజవేన, తన్నశశాక దగ్ధుమ్
సతత ఏవ నివవృతే, నైత (నైన) దశకం
విజ్ఞాతుం యదేతద్యక్షమితిః. (6)**



5. తస్మిన్ త్వయి = అటువంటి అతిశయాన్ని కల అగ్నివద్ద, కిం వీర్యమ్ = ఏమి సామర్థ్యం (నీది)?, ఇతి = అని (యక్షునిచే ప్రశ్నింపబడిన అగ్ని), పృథివ్యామ్ = ఈ భూమి మొదలైన లోకాలలో, యత్ ఇదమ్ = ఏ వస్తువు ఉన్నదో, ఇదమ్ సర్వమపి = అటువంటి అన్ని వస్తువులను, దహేయం = (నేను) దహిస్తాను, ఇతి = అని (అన్నాడు).

6. తస్మై = ఆ అగ్నికి ఎదుట, తృణమ్ = ఒక ఎండిన గడ్డిని, నిదధే = (యక్షునిచే) పెట్టబడింది, ఏతత్ దహ ఇతి = "దీనిని దహించు" అని (చెప్పబడింది), తత్ = ఆ గడ్డిపోచను, సర్వజవేన = తన వేగం అంతటితో, ఉపప్రేయాయ = దగ్గరకు వెళ్ళాడు, (అగ్ని) ఆవిధంగాకూడా, తత్ = ఈ గడ్డిని, దగ్ధుం న శశాక = దహించలేకపోయింది, సః = ఆ అగ్ని, తతః ఊవ = తనకు ఏ గడ్డిపోచను దహించే శక్తి లేకపోవడాన్ని గమనించినందున సిగ్గుపడి, నివవృతే = దేవతలుండే చోటుకు తిరిగివెళ్ళి పోయింది, యత్ ఏతత్ యక్షమ్ = పూర్వమే ఉన్న ఈ యక్షుని, ఏతత్ ఇతి = ఇంతటిది-అని, విజ్ఞాతుం = తెలియడానికి, న అశకమ్ = నేను శక్తుడను కాలేకపోయాను, ఇతి = అని (దేవతల దగ్గర చెప్పాడు).

అవ: అయిదవ మంత్రంలో, యక్షుడు అగ్నిని చూచి "నీ సామర్థ్యం ఎంతటిది?" అని అడిగాడు. దానికి అగ్ని "నేను లోకంలోని అన్నిటిని దహించగలను" అని బదులు పల్కడం తెలుపబడుతున్నది. ఆఱవమంత్రంలో, యక్షుడు అగ్ని ముందు ఒక ఎండిన గడ్డిపోచను పెట్టి, దానిని దహించమని పల్కడం, అగ్ని ఎంత ప్రయత్నించినా దహించలేకపోవడం, దానివల్ల సిగ్గుపడిన అగ్ని దేవతలదగ్గరకు తిరిగివెళ్ళి, "నేను ఈ యక్షుని గూర్చి "అతడు ఇటువంటి వాడు" అని తెలియలేను" అని పల్కడం చెప్పబడుతున్నది.

**వ్యాఖ్యానమ్:** అయిదవ మంత్రంలోని మొదటివాక్యం అగ్నిని గూర్చి యక్షుడు అడిగిన ప్రశ్న.

**(తస్మిన్ త్వయి కిం వీర్యమ్? ఇతి)**- సర్వశక్తుడవుగా, సర్వజ్ఞుడవుగా నిన్ను నీవు పొగడుకొంటున్నావు. అటువంటి నీదగ్గర ఏమి గొప్పతనం ఉన్నది?" అని యక్షుడు అగ్నిని అడిగాడు. దానికి అగ్ని ఇచ్చిన బదులు తరువాత వాక్యంలో తెలుపబడుతున్నది.

**(పృథివ్యామ్ యత్ ఇదమ్ సర్వమపి దహేయమ్ ఇతి)**- భూమి మొదలైన లోకాలలో ఏ యే వస్తువులున్నాయో వానిని అటిన్నిటినీ నేను దహిస్తాను-అని అగ్ని అన్నాడు. "పృథివీ" అనేది అన్ని లోకాలకు ఉపలక్షణం. ఇక, ఆఱవ మంత్రంలోని మొదటి వాక్యంతో యక్షుడు చేసిన ఒక పని వివరింపబడుతున్నది.

**(తస్మైతృణం నిదధే ఏతత్ దహేతి)** - ఆ అగ్నిముందు యక్షుడు ఒక ఎండిన గడ్డిపోచను పెట్టి, "దీనిని దహించు" అని అన్నాడు. తన శక్తి లేకుండా అగ్నికి దేనినీ దహించడం సాధ్యం కాదని తెలుపడానికి యక్షరూపంలో వచ్చిన బ్రహ్మం చేసిన పని ఇది. తరువాత వాక్యంలో, అగ్ని ఎంత ప్రయత్నించినా, దానిని దహించలేకపోయింది-అని చూపబడుతున్నది.

**(తత్ సర్వజవేన ఉపప్రేయాయ, తత్ దగ్ధుం న శశాక)**- అగ్ని తన సమస్త వేగంతో ఆగడ్డిపోచ దగ్గరకు వచ్చాడు. అయినా, దహించలేకపోయాడు. ఆఱవ మంత్రంలోని చివరి వాక్యంలో, సిగ్గుపడిన అగ్ని దేవతలవద్దకు తిరిగి వెళ్ళడం, తాను ఆ యక్షుని గూర్చి తెలియలేక పోయానని పల్కడం చెప్పబడుతున్నది.)



**(స తత్ ఏవ నివవృతే యత్ ఏతత్ యక్షం ఏతత్ ఇతి విజ్ఞాతుం న అశకమ్)**- ఆ అగ్ని, ఆ విధంగా చేయడానికి తనకు శక్తి లేక పోవడాన్ని గమనించినందున, సిగ్గుపడి దేవతల దగ్గరకు తిరిగి వెళ్ళాడు. "తన ముందున్న ఆ యక్షస్వరూపుడు ఎటువంటివాడనేది నాకు తెలియలేదు" అని దేవతలతో చెప్పాడు.

**(7,8, అథ వాయుమబ్రువన్, వాయవేతత్ విజానీహి**
**9,10) కిమేతద్యక్షమితి. తథేతి- 7**

**తదభ్యద్రవత్ - తమభ్యవదత్, కోసీతి. వాయుర్వా**
**అహమస్మీత్యబ్రవీత్, మాతరిశ్వావా అహమస్మీతి- 8**

**తస్మింస్త్వయి కిం వీర్యమితి. అపీదం సర్వమాద**
**దీయం యదిదం పృథివ్యామితి- 9**

**తస్మై తృణం నిదధౌ, ఏతదా ధత్స్వేతి, తదుపప్రే**
**యాయ సర్వజవేన, తన్న శశాకాదాతుమ్. సతత్**
**ఏవ నివవృతే. నైత (నైన) దశకం విజ్ఞాతుమ్. - 10**
**యదేతద్యక్షమితి.**

7. అథ = తరువాత, వాయుమ్ = వాయుదేవుని ఉద్దేశించి, అబ్రువన్ = (దేవతలు) పలికారు, వాయో = వాయుదేవా!, ఏతత్ యక్షమ్ = ఈ యక్షపురుషుడు, కిమ్ ఇతి ఏతత్ = ఎవరు? అనే విషయాన్ని, విజానీహి= తెలిసికో- అని, తథా ఇతి = ఆవిధంగానే, (అని వాయువు అన్నాడు).

8. తత్ = ఈ యక్షపురుషుని ఉద్దేశించి, అద్రవత్ = వాయువు వెళ్ళాడు, తం = ఆ వాయువును గూర్చి, కః అసి ఇతి = నీవెవరు? అని, అభ్యవదత్ = యక్షపురుషుడు అడిగాడు, (దానికి వాయువు), అహమ్

వాయుః వై అస్మి ఇతి = నేను వాయువు అనే పేరును కలవాడను- అని, అహం మాతరిశ్వానై అస్మి ఇతి = నేను మాతరిశ్వా అనే పేరును కలవాడను- అని, అబ్రవీత్ =అన్నాడు.

**9.** (అపుడు యక్షుడు), తస్మిన్ త్వయి = అటువంటి గొప్పతనాన్ని పొందిన నీలో, కిమ్ వీర్యమ్ అస్తి= ఏమి సామర్థ్యం ఉన్నది? (అని అడిగాడు). (దానికి వాయువు) పృథివ్యాం యత్ ఇదమ్ = భూమి మొదలైన లోకాలలో ఏ వస్తువులు ఉన్నవో, ఇదం సర్వమ్ అపి = ఆ వస్తువులన్నిటిని, ఆదదీయమ్ ఇతి = ఎగురుగొట్టగలను-అని (అన్నాడు).

**10.** తస్మై = ఆ వాయువు ముందు, తృణమ్ = ఒక గడ్డిపోచను, నిదధే = (యక్షునిచే) పెట్టబడినది, ఏతత్ ఆధత్స్వ ఇతి = ఈ గడ్డిపోచను ఎగురగొట్టు-అని, (యక్షుడు అన్నాడు), తత్ = ఆ గడ్డిపోచను, సర్వజవేన = తన వేగం అంతటితో, ఉపప్రేయాయ = వాయుదేవుడు సమీపించాడు, తత్ ఆధాతుమ్ = దానిని గ్రహించి ఎగురగొట్టడానికి, న శశాక = అతనికి సాధ్యంకాలేదు, సః =ఆ వాయుదేవుడు, తతః = గడ్డిపోచను గ్రహించి ఎగురగొట్టలేని కారణం చేతనే సిగ్గుపడి, నివవృతే = (దేవతల దగ్గరకు తిరిగివెళ్ళిపోయాడు, యత్ ఏతత్ యక్షమ్ = ఈ యక్షపురుషుడు, ఏతత్ ఇతి= ఎటువంటివాడు-అనే దానిని, విజ్ఞాతుం =తెలియడానికి, న అశకమ్ = నాకు సాధ్యం కాలేదు-అని అన్నాడు.

అవ: ఈ మంత్రాలలో దేవతలు యక్షపురుషుని తెలిసికొని రమ్మని వాయువును పంపడం, అతడు ఆ పని తనకు సాధ్యం కాకపోవడం పలుకగా, యక్షపురుషునిచే పెట్టబడిన ఒక గడ్డిపోచనుకూడా ఎత్తి ఎగురగొట్టలేనందున సిగ్గుపడి దేవతల వద్దకు వాయువు తిరిగి వెళ్ళిపోవడం చెప్పబడుతున్నది.



**వ్యాఖ్యానమ్:** ఈ నాల్గు మంత్రాలకు ముందున్న నాల్గు మంత్రాలువలెనే వ్యాఖ్యానం గ్రహించాలి. ఆ మంత్రాలలో వలెనే అగ్నికి బదులుగా ఇక్కడ వాయువు ఉన్నది. వాయువు తనకు వాయువని, మాతరిశ్వా అనే రెండు నామాలను గొప్పగా చెప్పుకొన్నాడు. "సర్వమాదాయ వాతి- గచ్ఛతి ఇతి వాయుః" - అనే వ్యుత్పత్తిద్వారా "అన్ని వస్తువులను గ్రహించి ఎగురగొట్టేవాడు" అని వాయుశబ్దానికి అర్థం. "మాతరి- ఆకాశే, శ్వయతి- గచ్ఛతి ఇతి మాతరిశ్వా" - అనే వ్యుత్పత్తి ద్వారా ఆకాశంలో గొప్పగా సంచరించగల్గినవాడు కనుక మాతరిశ్వా- అనే పేరు కల్గింది. ఈ రెండు పేర్లవల్ల ఏ వస్తువును అయినా గ్రహించి, ఆకాశంలో సంచరించగల్గినవాడనే తన గొప్పతనాన్ని వాయువు తెలుపుకొన్నాడు. తన శక్తి లేకపోతే గడ్డిపోచను కూడా ఎగురగొట్ట లేనివాడు ఇతడు- అని యక్షపురుషుడు అతనికి తెలిపాడు. అందుచేత రీతిలో పదవమంత్రం వరకు అగ్ని, వాయువు-అనే ఇద్దఱు దేవతలకు యక్షపురుషుడు గర్వభంగాన్ని చేశాడు.

**(11.12) అథేంద్రమబ్రువన్, మఘవన్ ఏతద్విజానీహి కిమేత**
**దృక్షమితి. తథేతి తదభ్యద్రవత్. తస్మాత్తిరోదధే -11**

**స తస్మిన్ ఏవాకాశేస్త్రియమాజగామ బహుశోభ**
**మానాముభాం హైమవతీమ్, తాం హోవాచ**
**కిమేతద్యక్షమితి-12**

**11.** అథ = ఆపిమ్మట, ఇంద్రం = (తమకు నాయకుడైన) దేవేంద్రుని ఉద్దేశించి, మఘవన్ = అందఱిచే పూజింపబడేవాడా!, ఏతత్ యక్షం కిమ్ ఇతి ఏతత్ = ఈ యక్షపురుషుడు ఎవరు? అనే విషయాన్ని, విజానీహి = తెలిసికో, ఇతి అబ్రవన్ = అని దేవతలు అన్నారు, తథా ఇతి = ఆ

విధంగానే చేస్తాను-అని ఇంద్రుడన్నాడు, తత్ అభి = ఆ యక్షపురుషుని, అద్రవత్ = సమీపించాడు, (ఇంద్రుడు), తస్మాత్= ఆ ఇంద్రుని ఎదుటినుండి, తిరోదధే = (ఆ యక్షపురుషుడు) అదృశ్యమయ్యాడు.

**12.** సః = ఆ ఇంద్రుడు, తస్మిన్ ఏవ ఆకాశే= యక్షపురుషుడు నిలచి ఉండే ఆ ఆకాశంలోనే, స్త్రియం= (యక్షపురుషునిచే పంపబడి, కన్పించిన) ఒక స్త్రీ దేవతను, ఆ జగామ =సమీపించాడు, బహుశోభమానాం = మిక్కిలిగా ప్రకాశిస్తున్నది (అందాన్ని కల్గినది), హైమవతీం = హిమవంతుని పుత్రిక, ఉమాం = 'ఉమ' అనే పేరును కల్గినది అయిన, తాం = ఆ స్త్రీదేవతను గూర్చి, ఏతత్ యక్షం కిమ్ = ఇక్కడ అదృశ్యుడైన యక్షపురుషుడు ఎవరు? అని, ఉవాచ = అడిగాడు.

అవ: అగ్ని, వాయువు యక్షపురుషుని గూర్చి అతడెవరో తెలియలేక, వెనుకు వచ్చినందున దేవతలు తమకు నాయకుడైన ఇంద్రుని యక్షపురుషుడెవరో తెలిసికొని రమ్మని పంపడం, దానికి అంగీకరించిన ఇంద్రుడు ఆయక్షుని దగ్గరకు వెళ్ళగానే, యక్షుడు అదృశ్యంకావడం, అపుడు అక్కడ ఒక అందమైన స్త్రీ ఆవిర్భవించడం -అనే విషయాలను ఈరెండు మంత్రాలు తెల్పుతున్నాయి.

వ్యాఖ్యానమ్: (అథేంద్రమబ్రువన్ భగవన్నేతద్విజానీహి కిమేతద్యక్షమితి)- వాయువు యక్షపురుషుడెవడో తెలియలేక, తన గర్వమంతా తీరిపోగా, దేవతల దగ్గర తిరిగి వెళ్ళిపోయాడు. అపుడు దేవతలు తమకు ప్రభువైన ఇంద్రునిచూచి, "ఇంద్రా! నీవు వెళ్ళి ఈ యక్షపురుషుడెవరో తెలిసికొనిరా" అని అన్నారు. ఇక్కడ ఇంద్రుడనేది సూర్యుని కాని, లేక, వజ్రధరుడైన ఇంద్రుని కాని తెలుపుతుంది-అని శంకరులు వ్యాఖ్యానించారు. ఇంద్రశబ్దం, మఘవన్ శబ్దం దేవేంద్రుని విషయంలోనే ప్రసిద్ధిని కల్గి ఉన్నందున, వాటికి ఆదిత్యుని అర్థంగా గ్రహించడం సరికాదు. "మహ-పూజాయామ్" అనే ధాతువు నుండి పుట్టిన మఘవచ్ఛబ్దం, "ఇది-పరమైశ్వర్యే" అనే ధాతువునుండి పుట్టిన ఇంద్రశబ్దం దేవతలచే పూజింపబడేవాడని, ముల్లోకాలకు అధిపతి అయిన ఇంద్రుని ఉద్దేశించే శ్రుతిస్మృతులలో ప్రయోగింపబడింది కదా!



**(తథేతి తదభ్యద్రవత్)** - "ఆ విధంగానే చేస్తాను" అని అంగీకరించి, ఇంద్రుడు యక్షపురుషుని దగ్గరకు వెళ్ళాడు.

**(తస్మాత్ తిరోదధే)**- ఆఇంద్రుని ఎదుటనుండి ఆ యక్షపురుషుడు అదృశ్యుడయ్యాడు. "ఇంద్రుడు తనను దేవతలచే పూజింపబడేవాడుగా, ముల్లోకాలకు అధిపతిగా అభిమానించే కారణంవల్ల" అనే అర్థాన్ని గ్రహించవచ్చు. ఇంద్రుడు, వాయువులకు వలె అతనికి కూడ గర్వభంగాన్ని కల్గిస్తే, తాను అతనిని దేవతలకు ప్రభువుగా, ముల్లోకాలకు అధిపతిగా నియమించిన పదవికి భంగం కల్గుతుంది-అనే దయతో యక్షపురుషుడు అదృశ్యుడయ్యాడు-అని భావం. ఇంద్రునకు అనుజుడైన ఉపేంద్రుడుగా (వామనుడుగా) అవతరించినవాడు కనుక, పరమపురుషుడైన యక్షుడు అతనికి గర్వభంగం కల్గించదలచలేదు-అని కూడా చెప్పవచ్చు. లేక, "తస్మాత్" అనేదానికి "ముందున్న ఆకాశప్రదేశంనుండి" అనే అర్థాన్ని గ్రహించవచ్చు. దీనికి తరువాత జరిగిన సంగతిని రెండవ మంత్రం తెల్పుతున్నది.

**(సః)** - ఆ ఇంద్రుడు,

**(తస్మిన్నేవ ఆకాశే)** - దీనికి ముందు యక్షపురుషుడు ఉండే ఆకాశప్రదేశం లోనే,

**(స్త్రియమ్ ఆజగామ)** - ఒక స్త్రీమూర్తి ఆవిర్భవించడాన్ని చూచి, ఆమెను సమీపించాడు. ఇంద్రునకు యథార్థాన్ని తెలియజేయాలి-అనే కృపతో యక్షరూపుడైన పరమాత్మచేత పంపబడినదే ఈ స్త్రీదేవత-అని తెలుస్తున్నది. "తస్మిన్నేవ ఆకాశే" అనే దానికి పిమ్మట "యక్షపురుషుడు ఎక్కడకు వెళ్ళాడు?" అనే కొన్నిపదాలను అధ్యాహరించుకొని, వాక్యభేదాన్ని చేసికొని, ఆనందభాష్యంలో అర్థం చెప్పబడింది. అతడు ఎవరనే దానిని, ఆమెవద్ద ఇంద్రుడు అడిగిన ప్రశ్నను మంత్రంలో ఉత్తరార్ధం తెల్పుతున్నది.

**(బహుశోభమానామ్ ఉమాం హైమవతీమ్)** - చాలా అందాన్ని కల్గినది, హిమవంతుని పుత్రిక, ఉమ అనే పేరును కల్గినది అయిన ఆమెను, "హైమవతీమ్" - హేమ మనబడే బంగారుతో చేయబడిన ఆభరణాలను కల్గినది, బహుశోభమానామ్= చాలా అందమైనది, మామ్ ఉ= 'మా' అనే పేరును కల్గినది అయిన ఆ లక్ష్మీదేవియే-అని అన్వయించి, ప్రతిపదార్థదీపికలో వ్యాఖ్యానింపబడింది. "తదు చంద్రమాః" (తైత్తి-నారా-7) మొదలైన చోట్లవలె ఉకారం ఏవకారార్థాన్ని కల్గినది. "లక్ష్మీం పురుషకారత్వే వృతవంతో వరానన", "లక్ష్మీః పురుషకారత్వేన నిర్దిష్టా పరమహర్షిభిః" అని పాంచరాత్రశాస్త్రంలో లక్ష్మీదేవియే పరమపురుషునితో చేతనుని చేర్చే పురుషకారస్వరూపిణిగా చెప్పబడుతున్నందున, ఇంద్రుని వద్ద ఆమెకు ఉండే ప్రీతి శ్రీవిష్ణుపురాణంలోని అమృతమథన ఘట్టంలో ప్రసిద్ధమైనందున, "చాలా అందమైనది" అని ఇక్కడ పల్కడం ఆమె విషయంలోనే ముఖ్యంగా పొసగుతున్నదుంన, "ఉమామ్" అనే దానిని "మామ్ ఉ" అని విడదీసి, అర్థాన్ని గ్రహించడంలో, "హైమవతీమ్" అనే దానికి "హేమాభరణాలను కల్గినది" అనే అర్థాన్ని గ్రహించడంలోను ఏ విరోధం లేదు-అని వారి అభిప్రాయం. ఏవిధంగా అర్థాన్ని గ్రహించినా, పరబ్రహ్మం స్త్రీదేవతకంటే వేఱయినది-అనే ఈ ప్రకరణం ద్వారా



వ్యక్తమవుతున్నందున శాక్తమతం ఉపనిషత్తు మెచ్చిన మతం కాదని తెలుస్తున్నది. శంకరులు తమ పదవాక్య భాష్యాలు రెండిటిలోను "ఉమా" అనే దానికి విద్యయే-అనేది ముఖ్యార్థంగా గ్రహించారు. "విరూపోపి విద్యావాన్ బహుశోభతే" (అందంలేకపోయినా, విద్యను కలవాడైతే చాలా ప్రకాశిస్తాడు) అని వాక్యభాష్యంలో పలికారు. "విరూపవాన్" అని అంటూ అందం లేనివానినిగా ఉమాపతిని కూడా తెలిపారు. పదభాష్యంలో "ఉమాశబ్దం పర్వతపుత్రిక అయిన పార్వతినే చెప్పవచ్చు. ఆమె, సర్వజ్ఞుడైన ఈశ్వరునితో సదా కూడి ఉన్నందున, బ్రహ్మం ఎవరు? అనే దానిని తెలిసికొంటారు-అని అభిప్రాయంతో ఇంద్రుడు ఆమెను సమీపించాడు" అని అన్నారు. శివునకు సర్వజ్ఞుడని సుప్రసిద్ధమైన పేరుతో కలిగే జ్ఞానవైశద్యాన్ని తెలిపారే తప్ప, "శివుడే బ్రహ్మం" అని అనలేదు కనుక, శివుని అతడు సగుణబ్రహ్మంగా భావించలేదు-అని తెలుస్తున్నది.

**(తాం హోవాచ కిమేతద్యక్షమితి)** - ఆ స్త్రీదేవతను "ఇక్కడ అదృశ్యుడైన యక్షపురుషుడెవడు?" అని ఇంద్రుడు ప్రశ్నించాడు.

## చతుర్థఖండమ్

### ప్రవేశం

తృతీయఖండంలో ఆరంభింపబడిన వృత్తాంతం ఇందులో కొనసాగింపబడుతున్నది. పరమాత్మ మహిమనుగూర్చి ఇంకా పలు విషయాలను పలికే ఈ నాల్గవ ఖండంతో ఈ ఉపనిషత్ ముగుస్తున్నది.

1. **సా బ్రహ్మేతిహోవాచ, బ్రహ్మణో వా ఏతద్విజయే**
**మహీయధ్వమ్ ఇతి, తతో హైవ విదాంచకార బ్రహ్మేతి॥**

సా = ఆ స్త్రీ దేవత, బ్రహ్మ ఇతి = (ఆయక్షుడు), బ్రహ్మమే-

అని, ఉవాచ హ = పల్కిందికదా, బ్రహ్మణః వా ఏతత్ విజయే = పరబ్రహ్మమనే పరమపురుషునకు చెందిన ఈ (మీ) విజయంలో, మహీయధ్వం = గొప్పతనాన్ని పొందండి, ఇతి (ఉవాచ)= అని పల్కింది, తతః హ ఏవ = ఆ ఉపదేశంవల్లనే, బ్రహ్మమ్ ఇతి విదాంచకార = యక్షుడు బ్రహ్మమే అని (ఇంద్రుడు) గ్రహించాడు.

1. అవ: ఆ స్త్రీదేవత "యక్షపురుషుడు బ్రహ్మమే" అని పల్కడం, "మీ విజయం బ్రహ్మవిజయమే" అని అనడం, దానిని విని ఇంద్రుడు యథార్థాన్ని గ్రహించడం-అనేవి మొదటి మంత్రంలో చెప్పబడుతున్నాయి.

**వ్యాఖ్యానమ్: (సా బ్రహ్మేతి హోవాచ)** ఆ దేవత "ఈ యక్షపురుషుడు బ్రహ్మమే కదా!" అని అన్నాడు. ఆ పురుషునిచే పెట్టబడిన ఒక చిన్న గడ్డిముక్కను కూడా మీరు ఏమీ చేయలేకుండా పోవడాన్నిబట్టే ఈ పురుషుడు బ్రహ్మమే అనేది స్పష్టమవుతున్నది- అని "హ" శబ్దం యొక్క తాత్పర్యం. "హ" అనే శబ్దం నిశ్చయాన్ని సూచిస్తుంది. అని ఆనందభాష్యం. బ్రహ్మశబ్దానికి "బృహతి, బృంహయతి" అనే వ్యుత్పత్తులద్వారా "తాను చాలా పెద్దగా ఉండడం, తనను పొందిన చేతనులను గొప్పవారినిగా చేయడం" అనే అర్థాలు తెలుపబడుతున్నాయి.

**(బ్రహ్మణో వా ఏతద్విజయే మహీయధ్వమ్ ఇతి)** "మీరు మీకు చెందినదిగా తలచిన జయం నిజానికి పరమాత్మకే చెందినది అయినందున, ఈ జయం బ్రహ్మానిదే-అని తెలిసి గొప్పతనాన్ని పొందండి" అని పల్కింది. మూడవ ఖండంలోని మొదటి మంత్రంలో పల్కినట్లుగా మీరు జయంగా భావించడం మానివేయండి" అని తాత్పర్యం.

**(తతోహైవ విదాంచకార బ్రహ్మేతి)** -ఈ ఉపదేశానికి



తరువాతనే ఇంద్రుడు "ఈ యక్షపురుషుడు బ్రహ్మమే" అని తెలిసికొన్నాడు. "అంతర్యామి అయిన అతనివల్లనే మనం విజయాన్ని పొందాము" అనే దానిని కూడా తెలిసికొన్నాడు-అనేది తాత్పర్యార్థంగా గ్రహించాలి.

**2. తస్మాద్వా ఏతేదేవా అతితరామి వాన్యాన్ దేవాన్**
**యదగ్నిర్వాయురింద్రః, తేహ్యేనన్నేదిష్ఠం పస్పృశుః,**
**తే (స) హ్యేనత్ ప్రథమో విదాంచకార బ్రహ్మేతి.**

తస్మాత్ వా = ఈ కారణంవల్లనే, ఏతే దేవాః = అగ్ని,వాయువు, ఇంద్రుడు-అనే ఈ ముగ్గురు దేవతలు, అన్యాన్ దేవాన్ = మిగిలిన దేవతలకంటే, అతితరామి వ = (యోగ్యతలతో) గొప్పతనాన్ని కల్గి ఉన్నారు, యత్ = ఎందుకంటే, తే = పూర్వం పల్కిన, అగ్నిః వాయుః ఇంద్రః= అగ్ని, వాయువు, ఇంద్రుడు- అనే ఈ ముగ్గురు దేవతలు, ఏనన్నేదిష్టం = ఈ పరమాత్మకు దగ్గరలో, పస్పృశుః = పొందారు, తే హి = వారే కదా, ప్రథమః = మొదట, ఏతత్ = ఈ యక్షుని, బ్రహ్మమ్ ఇతి= పరమాత్మ అని, విదాంచకార = తెలిసికొన్నారు.

అవ: బ్రహ్మాన్ని యక్షుని రూపంలో మొదట చూచినందున, దాని వద్దకు వెళ్ళినందున అగ్ని, వాయువు, ఇంద్రుడు-అనే ముగ్గురు దేవతలు మిగిలిన దేవతలకంటే గొప్పవారయ్యారు-అని ఈమంత్రం తెల్పుతున్నది.

**వ్యాఖ్యానమ్: (తస్మాద్వా ఏతే దేవాః అతితరామివ అన్యాన్ దేవాన్)**- పరబ్రహ్మం దగ్గరకు వెళ్ళడం, మాటలాడడం-మొదలైన సంబంధాలు కల్గినందున, అగ్ని, వాయువు, ఇంద్రుడు-అనే ఈముగ్గురు దేవతలు, వరుణుడు, కుబేరుడు, యముడు మొదలైన మిగిలిన దేవతలకంటే తమ యోగ్యతద్వారా గొప్పవారే అయ్యారు. "ఇవ" అనేపదం

ఇక్కడ ఏవకారంయొక్క అర్థాన్ని కల్గినది. నిరర్థకమని కొందఱు భావించారు. "వా" శబ్దం ఏవకారార్థాన్ని కల్గినది. "వై" అని కూడా విడదీయవచ్చు. ఇక మంత్రంలోని మిగిలిన భాగం "తస్మాత్" అని మొదట పల్కిన కారణాన్ని వివరిస్తున్నది.

**(యత్)** - "యస్మాత్ హేతోః"- ఏ కారణంవల్ల అయితే -అని అర్థం. ఈ పదం ముందు వాక్యంలో చెప్పబడినదానికి కారణాన్ని మంత్రంలోని ఉత్తరభాగం వివరించడం తెల్పుతుంది. ఛాందసమైనందున "యత్" అనే దానిని "యః" అని గ్రహించి, అగ్ని, వాయువు, ఇంద్రుడు -అనే మూడు పదాలతో అన్వయించి కొందఱు అర్థాన్ని చెప్పారు.

**(యత్ అగ్నిః వాయుః, ఇంద్రః తే హి ఏతత్ నేదిష్ఠం పస్పృశుః)**- అగ్ని, వాయువు, ఇంద్రుడు- అనే ఈ ముగ్గురే తదా ఈ పరబ్రహ్మస్వామీప్యాన్ని పొందారు. "నేదిష్ఠమ్ ఏతత్ వస్పృశుః" అని అన్వయించి, ఈముగ్గురు దగ్గరలో ఉండే బ్రహ్మాన్ని చూచారు" అనేది అర్థాన్ని చెప్పవచ్చు. "పస్పృశుః" అనే పదం-"దగ్గరకు వెళ్ళింది, చూచింది, పరిశీలించింది, మాటను పల్కింది" మొదలైన అన్నిటిని తెల్పుతుందని చెప్పవచ్చు. వీరి గొప్పతనానికి ఇంకొక కారణం కూడా ఇక చెప్పబడుతున్నది.

**(తే హ్యేతత్ ప్రథమో విదాంచకార బ్రహ్మేతి)** - ఈ ముగ్గురు దేవతలే కదా ఈ బ్రహ్మాన్ని బ్రహ్మమని మొదట తెలిసికొన్నారు. "ప్రథమః" అనేదానికి "ప్రథమమ్" అని అర్థం. లింగవ్యత్యయం ఛాందసం. "విదాంచకార" అనేది "విదాం చక్రుః" అనే అర్థాన్ని ఇస్తుంది. బహువచనార్థంలో ఏకవచన ప్రయోగం వేదం కనుక చేయబడింది. మొదట బ్రహ్మస్పర్శం, బ్రహ్మజ్ఞానం-అనే రెండు కల్గినందున, ఈ గొప్పతనాన్ని పొందని మిగిలిన దేవతలకంటే ఈ ముగ్గురు ప్రాధాన్యాన్ని



పొందారని భావం.

**3. తస్మాద్వా ఇంద్రోతి తరామి వాన్యాన్ దేవాన్, స హ్యేనన్నేదిష్ఠం పస్పర్శ, స మ్యేనత్ ప్రథమో విదాం చకార బ్రహ్మేతి.**

తస్మాత్ వా= ఈ కారణం వల్లనే, ఇంద్రః = ఇంద్రుడు, అన్యాన్ దేవాన్ = మిగిలిన దేవతలకంటే, అతితరామ్ ఇవ = అతిశయాన్ని పొందే వెల్గుతున్నారు, సః = అతడు, ఏతత్= ఈబ్రహ్మాన్ని, నేదిష్ఠం = చాలా దగ్గరగా, పస్పర్శ హి= చూచాడు కదా, సః = అతడు, ఏతత్ = ఈ పరతత్త్వాన్ని, బ్రహ్మమ్ ఇతి = బ్రహ్మం అని, ప్రథమః = మొదట, విదాంచకార హి= తెలిసికొన్నాడు కదా!

అవ: ఇంద్రునకు పరబ్రహ్మస్వభావం, జ్ఞానం గొప్పగా కల్గినందున, అతడు మిగిలిన దేవతలందఱికంటే గొప్పవాడు-అని చెప్పబడుతున్నది.

**వ్యాఖ్యానమ్: (తస్మాద్వా ఇంద్రః అతితరామివ అన్యాన్ దేవాన్)**- పూర్వమంత్రంలో చెప్పబడ్డ రెండు కారణాలవల్లనే, ఇంద్రుడు మిగిలిన దేవతలకంటే గొప్పవాడై వెల్గుతున్నాడు. ఆ కారణాలను ఈ మంత్రంలోని మిగిలిన భాగం తెల్పుతున్నది.

**(న హేనన్యేదిష్ఠం పస్పర్శ)** - ఆ ఇంద్రుడే కదా మిగిలిన ఇద్దఱికంటే చాలా దగ్గరగా ఆ పరతత్త్వాన్ని దర్శించాడు. దీనివల్ల అగ్ని, వాయువులకంటే ఇంద్రుడు చాలా దగ్గరకు వెళ్ళినపుడే యక్షపురుషుడు అదృశ్యుడయ్యాడని తెలుస్తున్నది. లేక, స్త్రీదేవతతో మాటలాడడం మొదలైనవానివల్ల, బ్రహ్మంతో, వారికంటే అధికమైన సంబంధాన్ని పొందిన దానినిబట్టి "నేదిష్ఠమ్ పస్పర్శ" అని చెప్పబడిందని కూడా చెప్పవచ్చు.

ఇక, రెండవ కారణం తెలుపబడుతున్నది.

**(స హ్యేతత్ బ్రహ్మ ఇతి ప్రథమో విదాంచకార)** -అతడే కదా, ఆ యక్షపురుషుని బ్రహ్మం-అని తెలిసికొన్నాడు. ఈ విధంగా, బ్రహ్మంతో చాలా దగ్గరగా సంబంధాన్ని పొందినందున, మొదట, బ్రహ్మజ్ఞానం పొందినందున ఇంద్రుడు మిగిలిన దేవతలకంటే ఐశ్వర్యం, బలం, బుద్ధి మొదలైనవానితో అతిశయాన్ని పొందినవాడయ్యాడని తాత్పర్యం.

**ఉభయవేదాంతైకకంఠ్యం:** ఈ సందర్భంలో వివరింపబడిన వృత్తాంతంవల్ల దేవతలలో భేదం ఉన్నదని, దేవతలందఱికి ప్రభువు ఇంద్రుడని, ఈదేవతలకు బ్రహ్మ నిలిపిన చిన్న గడ్డిముక్కను కూడ ఏమీ చేయగల్గిన శక్తి లేదని, దేవతల జయం వాస్తవానికి బ్రహ్మంయొక్క జయమే-అని, పరబ్రహ్మం అనుగ్రహించిన శక్తితోనే దేవతలు ఆయా కార్యాలలో ప్రవర్తిస్తున్నారని తెలుస్తున్నది. ఈఉపనిషత్తులోని మొదటి ఖండంలో "బ్రహ్మాన్ని మనస్సుతో తెలియడం సాధ్యం కాదు" అని, ''బ్రహ్మంయొక్క నియమనంతోనే మనస్సు మిగిలినవానిని తెలిసికొంటున్నా"డని చెప్పబడింది. ఇంద్రియాల విషయంలో కూడా ఈ విధంగానే చెప్పబడింది. ఈ వాక్యాలు "యస్య మనః శరీరం యో మనోంతరే సంచరన్, యం మనో న వేద" (ఎవనికి మనస్సు శరీరమో, ఎవడు మనస్సులో సంచరిస్తూ నియమిస్తున్నాడో, ఎవనిని మనస్సు తెలియలేదో) అని ఆరంభించి, ''ఏష సర్వభూతాంతరాత్మా అపహతపాప్మా దివ్యో దేవ ఏకో నారాయణః'' (ఇతడే సర్వభూతాంతరాత్మ, దోషరహితుడు పరమపదవాసి, సాటి లేనివాడు అయిన నారాయణుడనే దేవుడు) అని ముగిసే సుబాలోపనిషత్ వాక్యాలతో ఒకే అర్థాన్నికల్గి ఉన్నందున ఇక్కడ చెప్పబడే బ్రహ్మం నారాయణుడే-అని తెలుస్తున్నది. "నారాయణ పరంబ్రహ్మ" అనే తైత్తిరీయ వాక్యం కూడా దీనిని దృఢపరుస్తున్నది. జ్ఞానాన్ని ఇవ్వగల్గినవాడైన శివుని



పత్ని అయిన ఉమ ఈ బ్రహ్మాన్ని గూర్చి ఉపదేశించడంలో ఏ లోటు లేదు. "కణ్డు వణఙ్గినార్క్కు ఎన్నాళ్గొల్! కామనుడల్ కొణ్డ తవత్తాఱ్కు ఉమై యుణర్త్త, వణ్డలమ్బుమ్ తారలఙ్గల్ నీళ్ముడియాన్ తన్ పెయరే కేట్టిరున్దు అఙ్గారలఙ్గలానమైయాలాయ్న్దు" (మన్మథుని శరీరాన్ని దహించిన రుద్రునకు పార్వతి ఉపదేశించగా, తుమ్మెదలు సంచరించే తులసి, పూలతో కూర్చిన మాలను అలంకరించుకొన్న, గొప్ప కిరీటాన్ని కల సర్వేశ్వరుని తిరునామాలను ఆ రుద్రుడు విని, వానిలో లగ్నమై, వాడిన మాలవలె పరవశుడయ్యాడు. అందువల్ల సర్వేశ్వరుడెవరో తెలిసికొని, సేవిస్తే సేవించినవారికి ఏమంచి కలుగదు?) (నాన్ముకన్ తిరు-78) అని తిరుమళిశై ఆళ్వార్లు అనుగ్రహించినట్లుగా శివునితో చేరి భగవానుని తిరునామాన్ని అనుసంధించే భాగ్యాన్ని ఉమ పొందినది కదా!. దేవతలందఱు పరమపురుషుని శరీరభూతులై, అతనిచే నియమింపబడేవాడై, అతనిచే శక్తిని పొందే ప్రవర్తిస్తున్నారు- అని ఇక్కడ చెప్పబడిన విషయం "తిశైయుమ్ తిశై యుఱు దెయ్వముమ్ దెయ్వత్తిశైయుమ్ కరుమఙ్గళెల్లామ్, అశైవిల్ శీర్క్కణ్ణన్ నెడుమాల్ కడల్కడైన్ద కారోదవణ్ణన్ పడైత్త మయక్కు" (దిక్కులు, దిక్కులలోని దైవాలు, ఆదైవాలకు తగిన కర్మలు అన్నీ-నాశంలేని కల్యాణగుణాలు కల, శ్రీకృష్ణుడై అవతరించిన, సర్వాధికుడైన, గొప్ప మహిమను కల, సముద్రాన్ని చిలికిన, సముద్రవర్ణుడైన స్వామి సృష్టించిన మాయలు) (ముదల్ తిరు-7), "ఉమైక్కుమేల్ ఎత్తేవర్ నాలాట్టుమ్ ఎవ్వాఱు శెయ్కైయుమ్, అప్పోదళియుమ్ అళైప్పు" (భగవానుడు ఉపేక్షిస్తే దేవతలంటి అభిమానం, అన్ని విధాలైన యాగాదులు, వాటిలో చేయబడే ఆ దేవతల ఆహ్వానాలు అన్నీ నిష్ఫలాలు) (నాన్ముకన్ తిరు-38), "దామోదరనురువాకియ శివఱ్కుమ్ తిశైముకఱ్కుమ్ ఆమో తరమఱియ

ఎమ్మానై ఎన్ అప్పన్ వణ్ణనైయే" (దామోదరునకు శరీరభూతులైన శివునకు, చతుర్ముఖునకు మనస్వామియైన సముద్రవర్ణుని తెలిసికోవడం సాధ్యమా!) (తిరువాయ్ 2-7-11) మొదలైన పలు చోట్ల ద్రావిడవేదమైన దివ్యప్రబంధాలలో ద్రఢీకరింపబడడం ఇక్కడ అనుసంధింపదగినది.

**4. తస్యైష ఆదేశో యథైతద్విద్యుతో వ్యద్యుతదా ఇతి ।**
**ఇన్న్యమిష (మీమిష)దా ఇత్యధిదైవతమ్ ॥**

తస్య = ఆవిర్భవించి అదృశ్యమైన బ్రహ్మానికి, ఏషః = తరువాత చెప్పబోయే ఇది, ఆదేశః= ఉపమానం అవుతుంది, యత్ =లోకంలో ప్రసిద్ధమైన, ఏతత్ = ఈ, విద్యుతః = మెఱపుయొక్క, వ్యద్యుతత్ ఆ = ప్రకాశంవలె, ఇత్ = ఇంకా, న్యమామీషత్ ఆ= (కన్ను) మూసేటపుడు అన్నీ అదృశ్యంకావడం వలె, ఇతి = అని, అధిదైవతమ్= (దేహానికి బయట ఉండే) మెఱపు రూపంలోని ఉపమానం.

అవ: పూర్వం పల్కిన వృత్తాంతంలో బ్రహ్మం కొంచెంసేపు ప్రత్యక్షమై, అదృశ్యం కావడానికి, ఉపమానాన్ని ఈమంత్రం పల్కుతున్నది. ఉపమానాన్ని పల్కడం ద్వారా బ్రహ్మాన్ని ఉపాసించదగిన రీతికూడా వ్యక్తమవుతున్నది-అని ఆనందభాష్యంలోని వివరణం.

వ్యాఖ్యానమ్: **(తస్య)** - చటుక్కున ప్రత్యక్షమై కొంచెం సేపు ప్రకాశించి, ఇంద్రుడు దగ్గరకు రాగానే అదృశ్యమైన ఆ బ్రహ్మానికి,

**(ఏష ఆదేశః)** - తరువాత చెప్పబోయే రెండు ఉపమాన రూపమైన ఉపదేశాలు... మంత్రంలోని రెండవ పాదం మొదటి ఉపమానాన్ని తెల్పుతున్నది.

**(యత్ ఏతత్ విద్యుతః వ్యద్యుతత్ ఆ)** - "ఆ" అనేది "ఇవ" వలె ఉపమావాచకం. మెఱపు ప్రకాశం వలె బ్రహ్మం ప్రకాశించడం కూడా కొంచెం సమయమే-అని భావం. బ్రహ్మం అదృశ్యం అయే రీతికి ఇంకొక ఉపమానాన్ని మూడవ పాదం తెల్పుతున్నది.

**(ఇతి)**- ఇంతేకాక- అని అర్థం. ఈ పదం సముచ్చయార్థాన్ని ఇస్తుంది. ఇక్కడ "ఆ" అనేదానికి "ఇవ" అనే ఉపమానార్థాన్ని కల్గినదానినిగానో, లేక ప్రసిద్ధార్థకంగానో గ్రహించవచ్చు. "న్యమీమిషత్" అనే పదాన్ని అనుసరించి "చక్షుః" అనే పదాన్ని అధ్యాహరించుకోవాలి. "కన్నుమూసినట్లుగా" అని అర్థం. "కన్ను మూసికోగానే అన్ని వస్తువులు అదృశ్యమయేటట్లే, ఇంద్రుడు దగ్గరకు రాగానే బ్రహ్మం అదృశ్యమైనది. అని భావం. లేక, ఇక్కడ ఒకే ఉపమానంగా గ్రహించవచ్చు.

**(యత్ ఏతత్ విద్యుతః వ్యద్యుతత్ ఆ)**- ఈమె మెఱపులు ఏ విధంగా ప్రకాశిస్తున్నాయో,

**(ఇత్)**- ఇంతేకాక,

**(న్యమీమిషత్ ఆ)** - తిరిగి అదృశ్యమైపోతాయో, ఆ విధంగానే బ్రహ్మం కూడా కొంచెం సేపు ప్రత్యక్షమై, వెంటనే అదృశ్యమైనది. ఇక్కడ "విద్యుతః" అనేది ప్రథమావిభక్తి బహువచనరూపం. "మెఱపులు" అని అర్థం. "వ్యద్యుతత్", "న్యమీమిషత్" అనే బహువచన రూపాలకు బదులుగా ఏకవచనంగా ప్రయోగింపబడడం ఛాందసప్రయోగం. ఆనందభాష్యంలో "విద్యుతః" అనే పదంలో ఛాందసమైనందున, ఏకవచనానికి బదులుగా బహువచనం వ్యవహరింపబడుతున్నది-అని భావింపబడింది. రెండవ పాదానికి "బ్రహ్మం మెఱపువలె దేవతలకు ప్రకాశించింది. అందువల్ల బ్రహ్మం. మెఱపువలె కాంతిని కల్గినదిగా ఉపాసించదగినది-అని ఇక్కడ విధింపబడుతున్నది. కన్ను మూసికొంటే ఏమీ ప్రకాశించనట్లుగా, మెఱపు మెఱసినపుడు కూడా ఏమీ

ప్రకాశించకుండా చీకటిగా ఉంటుంది. అందువల్లనే "న్యమీషత్" అని కన్ను మూసికోవడాన్ని దృష్టాంతంగా చెప్పడం జరిగింది. ఈ ఉపమానం ద్వారా బ్రహ్మం ప్రకాశించేది-అని, శీఘ్రంగా ప్రకాశించి అదృశ్యమవుతుంది అని, ఉపాసించదగినది-అని, విధింపబడుతున్నది-అని ఆనందభాష్యం. వేఱు రీతిలో కూడా ఈ భాష్యానికి అర్థం గ్రహింపబడింది. ఏవిధంగా అంటే- "విద్యుతః" అనేది ద్వితీయావిభక్తిలో బహువచనరూపం. "మెఱుపులను" అని అర్థం. ఇక్కడ "మిన్నల్" (మెఱుపు) అనేది తేజస్సును కల వస్తువులకు ఉపలక్షణం. "ఆ" అనేది "సమంతాత్" (అన్నిచోట్ల) అనే అర్థాన్ని ఇస్తుంది. "ఏతత్ విద్యుతః వ్యద్యుతత్ ఆ" అనే రెండవ పాదం ద్వారా మెఱుపులు మొదలైన ప్రకాశించే వస్తువులను కూడా బ్రహ్మమే ప్రకాశింపజేస్తున్నది-అని చెప్పబడుతున్నది. అందువల్ల ఈ రీతిలో బ్రహ్మం ఉపాసించదగినది-అని భావం. "ఆ న్యమీమిషత్" అనే పదాలతో బ్రహ్మమే అన్నిచోట్ల మెఱుపులు మొదలైన ప్రకాశించే వస్తువులను మఱుగుపరుస్తుంది-అనే అర్థం. చెప్పబడుతున్నది. కనుక, ప్రకాశించే వస్తువులను కూడా మఱుగు పరచే శక్తిని కల్గినది, బ్రహ్మం-అని ఇక్కడ ఉపాసించదగినది-అని చెప్పబడుతున్నది.

**(ఇతి అధిదైవతమ్)** - అనేది దేహానికి బయట ఉండే మెఱుపు విషయంలోని ఉపమానం. తరువాత మంత్రంలో దేహం లోపల ఉండే ఉపమానం చూపబడుతున్నందున, ఇక్కడ "అధిదైవతమ్" అనేది దేహానికి బయట ఉండే వస్తువులను గూర్చిన ఉపమానంగా గ్రహింపబడింది.

**5. అథాధ్యాత్మమ్. యదేత (న) ద్గచ్ఛతీవ చ మనో న (మనోనేన) చైన (త) దుపస్మరత్యభీక్ష్ణం సంకల్పః ॥**

అథ = తరువాత, అధ్యాత్మం =దేహంలో ఉపమానం, (చెప్పబడుతున్నది), యత్ ఏతత్ మనః గచ్ఛతి ఇవ = ఈ ప్రసిద్ధమైన బ్రహ్మాన్ని మనస్సు పొందేటట్లే ఉన్నా, (చాలా సేపు అందులో నిలకడగా నిలువనట్లే), సంకల్పః = మనస్సు, అభీక్ష్ణం = అన్ని కాలాలలో, ఏతత్ = ఈ పరబ్రహ్మాన్ని, న ఉపస్మరతి = స్మరించడం లేదుకదా!

అవ: ఇక, బ్రహ్మం కొంచెం సేపు ప్రకాశించి, అదృశ్యం కావడానికి, దేహానికి లోపల ఉండే ఒక దృష్టాంతం తెలుపబడుతున్నది.

వ్యాఖ్యానమ్: (అథ) విద్యుత్ అనే దేవతను గూర్చిన అధిదైవత దృష్టాంతానికి పిమ్మట "అధ్యాత్మమ్" (శరీరం లోపల ఉండే దృష్టాంతం ప్రస్తావింపబడుతున్నది. ఆత్మశబ్దం ఇక్కడ శరీరాన్ని తెల్పుతుంది. "ఆత్మని ఇతి అధ్యాత్మమ్" అనే విధంగా శరీరంలో ఉండే దృష్టాంతం చెప్పబడుతున్నది-అని అర్థం. అది ఏది? అంటే,

**(యత్ ఏతత్ మనః గచ్ఛతి ఇవ)** - ఈ ప్రసిద్ధమైన బ్రహ్మాన్ని మనస్సు పొందేటట్లే తోచినా, ఏ విధంగా మనస్సు అందులో చిరకాలం నిలువగల్గడం లేదో, అదేవిధంగా యక్షరూపమైన బ్రహ్మం యొక్క స్ఫురణం కూడా కొంచెం సేపే ఉంటుందని తాత్పర్యం. మంత్రంలోని తరువాతభాగం దీనినే వివరిస్తున్నది.

**(సంకల్పః)**- "సమ్యక్ కల్ప్యంతే కామాః అనేన ఇతి సంకల్పః-మనః" (ఆశలు దీనివల్ల చక్కగా కల్పింపబడుతాయి కనుక మనస్సు సంకల్పమని అనబడుతున్నది) అనే వ్యుత్పత్తిద్వారా సంకల్పశబ్దం మనస్సును నిర్దేశిస్తుంది. ఇక్కడ మనస్సు చేసే వ్యాపారమైన ధ్యానవిశేషాన్ని సూచిస్తుంది.

**(అభీక్ష్ణమ్)** -అన్ని కాలాలలోను,

**(ఏతత్)** -ఈ పరబ్రహ్మాన్ని,

**(న ఉపస్మరతి)** - స్మరించడం లేదుకదా! కొంచెం కాలమే కదా బ్రహ్మాన్ని మనస్సు స్మరిస్తున్నది-అని భావం. ఈ విధంగా మనస్సుయొక్క స్మరణాన్ని ఉపమానంగా పల్కినందున ఇది ఆధ్యాత్మదృష్టాంతం.

ఆనందభాష్యంలో "మనో న" అనేదానికి బదులుగా "మనో-నేన" అనే పాఠభేదాన్ని గ్రహించి, వేఱువిధంగా అర్థం చెప్పబడింది. "అనేన మనః" అనేది. "ఈ బ్రహ్మంతో ప్రేరేపింపబడిన మనస్సు" అనే అర్థాన్ని ఇస్తుంది. మిగిలిన పదాలకు పూర్వంవలెనే అర్థాన్ని గ్రహించాలి. లేక, వేఱు రీతిలో ఈ క్రింది విధంగా అర్థాన్ని చెప్పవచ్చు.

**(అనేన మనః యత్ ఏతత్ గచ్ఛతి ఇవ)** పరబ్రహ్మం చేత ప్రేరేపింపబడిన మనస్సు ఏ పరబ్రహ్మను పొందేటట్లుగా తోస్తున్నదో-అని అర్థం. నిజానికి పొందలేదో-అని భావం. "యత్ మనసా న మనుతే యేనాహుర్మనోమతమ్" (కేన-1-6) ఏ పరతత్త్వం మనస్సుతో తెలియబడడంలేదో, దేనిచే ప్రేరేపింపబడి మనస్సు అన్యవస్తువులను తెలుస్తున్నదో-అని ఈ ఉపనిషత్తులోనే ఈ విషయం చెప్పబడింది కదా! ఈవిధంగా మనస్సు వాస్తవానికి బ్రహ్మాన్ని పొందలేకపోతే, ఉపాసకులు ఏ విధంగా బ్రహ్మాన్ని ధ్యానించడానికి సాధ్యమవుతుంది? అని అంటే-

**(అనేన చ మనః ఏతత్ ఉపస్మరతి అభీక్ష్ణమ్)**- ఈ పరమాత్మచే అనుగ్రహింపబడిన మనస్సే ఈ బ్రహ్మాన్ని మళ్ళీ మళ్ళీ స్మరిస్తున్నది. అందువల్ల, అతని అనుగ్రహం వల్ల ఉపాసకులు ఉపాసించవచ్చు-అని భావం. ఆ మనస్సు ఎటువంటిది? అని అంటే-

**(సంకల్పః)**- "సంకల్పయతి ఇతి సంకల్పః" - అనే వ్యుత్పత్తి ద్వారా సంకల్పాన్ని చేసేది మనస్సు-అని తెలుపబడుతున్నది. ఛాందసమైనందున "సంకల్పః" అని పుంలింగ ప్రయోగం చేయబడింది. ఇటువంటి బ్రహ్మం ఉపాసించదగినది-అని భావం. లేక, సంకల్పశబ్దం నిత్యపుంలింగంగా కూడా గ్రహించవచ్చు. ఈ విధంగా "ఏ పరమాత్మ అనుగ్రహిస్తే మనస్సు బ్రహ్మాన్ని స్మరించగలిగేది అవుతున్నదో, ఎవని అనుగ్రహం లేకపోతే మనస్సు అతనిని స్మరించలేదో, అటువంటి పరమాత్మ ఉపాసించదగినవాడు"-అనేది ఉపదేశం-అనేది మంత్రంలోని సారార్థం.



సుబోధినీ వ్యాఖ్యానంలో గడచిన మంత్రానికి, ఈ మంత్రానికి వేఱు విధంగా ఈ క్రింది రీతిలో అర్థం తెలుపబడింది.

**4వ మంత్రం: (తస్యైష ఆదేశః యదేతత్ విద్యుతో వ్యద్యుతత్)**- మెఱుపు మెఱవడమనే ఏది ఉన్నదో, అది పరమాత్మయొక్క ఆజ్ఞయే- అని అర్థం. ఇక్కడ ఆదేశశబ్దం ఆజ్ఞను తెల్పుతుంది. "మేఘోదయ స్సాగరసన్నివృత్తిః, ఇందోర్విపాకః స్ఫురితాని వాయోః, విద్యుద్విభంగోగతముష్ణరశ్మేర్విష్ణోర్విచిత్రాః ప్రభవంతి మాయాః" (మేఘం ఉదయించడం, సముద్రం తీరాన్ని దాటకుండా ఉండడం, చంద్రకళలు పెరగడం, తరగడం, వాయువు వేగంగాగాని, మెల్లగా గాని వీచడం, మెఱుపు మెఱసి అదృశ్యం కావడం, సూర్యసంచారం-అనేవి అన్నీ విష్ణువుయొక్క విచిత్రమైన సంకల్పంవల్ల ఏర్పడుతున్నాయి) అని చెప్పబడింది కదా! ఈ విధంగా ఆశ్చర్యకరమైన వ్యాపారాలు విష్ణువు ఆజ్ఞతో సంభవించేవా? అని అంటే, చిన్నది కాని, పెద్దది కాని, అన్ని వ్యాపారాలు అతని ఆజ్ఞవల్లనే సంభవిస్తున్నాయి-అని చెప్పబడుతున్నది.

**(న్యమీమిషత్)** - కనురెప్ప తెఱచుకొని, మూసికోవడం వంటి చిన్న వ్యాపారాలు కూడా అతని ఆజ్ఞతో ప్రవర్తించేవే-అని భావం.

**5వ మంత్రం:** ఈ విధంగా అధిదైవతమైన బాహ్యవ్యాపారాలు పరమాత్మ ఆజ్ఞతో నడుస్తున్నాయి-అని పల్కి, ఈ మంత్రంలో అధ్యాత్మికమైన (మానవుని శరీరంలోపల వర్తించే) కార్యాలు కూడా అతని ఆజ్ఞతోనే నడుస్తున్నాయి-అని తెలుపబడుతున్నది.

**(యత్ ఏతత్ మనః సంకల్పః అభీక్ష్ణమ్ ఉపస్మరతి)** - ఇదే మనస్సు కొంత సమయం సంకల్పంగా (అంటే-సంకల్పం ద్వారా) పలుమార్లు ఆ యా విషయాలను స్మరించడం,

**(అనేన చ)**- మనస్సుయొక్క ఈ దశలు ఆ పరమాత్మ యొక్క ఆజ్ఞవల్లనే ఈ విధంగా చిన్న వ్యాపారాలతోపాటు, పెద్ద వ్యాపారాలతో పాటు ఏ తేడా లేకుండా అన్నీ పరమాత్మయొక్క ఆజ్ఞవల్లనే నడిచేటపుడు, మీ (దేవతల) విజయంకూడా అతని ఆజ్ఞవల్లనే కల్గింది-అనే నిజాన్ని తెలియలేక, మీరు జయాన్ని మీ జయంగా భ్రమించకూడదు-అని పార్వతి దేవతలకు ఉపదేశించింది.

**6. తద్ధ తద్వనం నామ తద్వనమిత్యుపాసితవ్యమ్.**
**స య ఏతదేవం వేద, అభిహైనం సర్వాణి భూతాని సంవాంఛంతి.**

తత్ హ తత్ = పూర్వం పల్కిన అతిశయాన్ని కల ఆబ్రహ్మం, వనం నామ = వనమనే నామాన్ని కల్గినది, తత్= అందువల్ల, వనమ్ ఇతి ఉపాసితవ్యమ్ = "వనమ్" (అందఱిచే సేవించదగినది) అని ఉపాసించాలి, సః యః =అతిశయాన్ని పొందినవాడైన ఎవడు, ఏవం వేద = (ఈ బ్రహ్మాన్ని) ఈ రీతిలో ఉపాసిస్తున్నాడో, ఏనమ్ అపి = ఇతనిని గూర్చి, సర్వాణి భూతాని= జీవులందఱు, సంవాంఛంతి = చాలా ప్రార్థిస్తున్నారు.



**అవ:** బ్రహ్మాన్ని ఉపాసించే రీతిని, ఆ ఉపాసనవల్ల కలిగే ఫలాన్ని ఈ మంత్రం తెల్పుతున్నది.

**వ్యాఖ్యానమ్: (తద్ధ తత్ వనమ్ నామ)** - పూర్వం పల్కిన గొప్పతనాన్ని కల ఆ బ్రహ్మం "వనమ్" అనే పేరును కల్గినది-అని అర్థం. "హ" శబ్దం ప్రసిద్ధిని తెల్పుతుంది. "వన-షణ-సంభక్తౌ" అనే ధాతువునుండి "వన్యతే సేవ్యతే సర్వైః" అనే వ్యుత్పత్తిద్వారా ఏర్పడినది కనుక, వనశబ్దం అందఱిచే సేవింపబడేది-అనే అర్థాన్ని ఇస్తుంది. "బ్రహ్మ వనమ్" (తైత్తి.సం-2-8-7) అని యజుస్సంహితలో బ్రహ్మం వనమనే శబ్దంతో నిర్దేశింపబడింది కదా! ఆనందభాష్యంలో "తత్ హ" అని సుప్రసిద్ధమైన బ్రహ్మాన్ని నిర్దేశిస్తున్నదని భావించి, "తద్వనమ్" అని దానికి తిరునామంగా చెప్పబడింది. "తచ్చ తద్వనం చ తద్వనమ్" అని కర్మధారయసమాసంగా గ్రహించి "తత్", "వనమ్" అని "తద్వనమ్" అనే పదంలో రెండు తిరునామాలు అణగి ఉన్నట్లుగా కూడా భావింపబడింది. "తను-విస్తారే" అనే ధాతువునుండి పుట్టిన తచ్ఛబ్దం బ్రహ్మం సర్వవ్యాపి అని తెల్పుతున్నది "వన" శబ్దం ముందు తెల్పినట్లుగా అందఱిచే భజింపదగినదనే విషయాన్ని తెల్పుతున్నది. సుబోధినీ వ్యాఖ్యలో "నామ" శబ్దంతో ప్రసిద్ధి తెలుపబడుతున్నదని భావించి, "ఆ బ్రహ్మం వనం" (అందఱిచే ప్రార్థించదగినది) అని ప్రసిద్ధం అనే అర్థం గ్రహింపబడింది.

**(తత్ వనమితి ఉపాసితవ్యమ్)**-అందువల్ల అది "వనమ్" అని ఉపాసించదగినది. ఆనందభాష్యానుసారం "తత్" అనే నామంతోను, "వనమ్" అనే నామంతో ఉపసించదగినది అని అర్థం. ఇక, మంత్రంలోని తరువాతి భాగం ఈ విధంగా ఉపాసించేవానికి కలిగే ఫలం తెలుపబడుతున్నది.

**(సః యః ఏవం వేద)** ఇటువంటి గొప్పతనాన్ని, ప్రసిద్ధిని పొందిన, ఎవడు ఈ బ్రహ్మాన్ని ఈవిధంగా ఉపాసిస్తున్నాడో, అని అర్థం. "సః" అనే పదం అతని గొప్పతనాన్ని, ప్రసిద్ధిని చూపుతున్నది.

**(ఏవమభిసర్వాణి భువనాని సంవాంఛంతి)-** ఇతనిని జీవులందఱు "ఇతడే మనలను ఉద్ధరిస్తాడు" అని ఇతనిని ప్రార్థిస్తున్నారు. "అభిసంవాంఛంతి" అని కలిపి, "కోరుతున్నారు" అని ఆనందభాష్యంలో అర్థం తెలుపబడింది. "అభివేద" అని కలిపి, "ఎవడు బ్రహ్మాన్ని అన్నివిధాలుగా తెలిసికొంటున్నాడో" అని ప్రతిపదార్థదీపికలో అర్థం గ్రహింపబడింది.

**7. ఉపనిషదం భోఃబ్రూహీతి. ఉక్తా త ఉపనిషత్ ।**
**బ్రాహ్మీం వావ త ఉపనిషదమబ్రూమేతి॥**

(శిష్యుడు పల్కుతున్నాడు) భోః= ఆచార్యా!, ఉపనిషదం= (భగవదనుగ్రహానికి సాధనాన్ని తెలిపే) ఉపనిషత్తుకు, బ్రూహి = చెప్పండి, ఇతి =అని, (దీనికి ఆచార్యుడు బదులుపల్కుతున్నాడు), తే= నీకు, ఉపనిషత్ = ఉపనిషత్తు, ఉక్తా = (గడచిన మంత్రం వరకు) చెప్పబడింది, బ్రాహ్మీమ్ ఉపనిషదమ్ = బ్రహ్మంయొక్క అనుగ్రహాన్ని కల్గించే బ్రహ్మవిద్యను తెలిపే ఉపనిషత్తును, తే = నీకు, అబ్రూమ వావ= చెప్పాముకదా!

అవ: బ్రహ్మం యొక్క అనుగ్రహాన్ని కల్గించే ఉపాసనం గడచిన మంత్రంలో చెప్పబడింది. ఈ మంత్రంలోను, బ్రహ్మప్రాప్తి సాధనాన్ని తెలిపే ఉపనిషత్ భాగంలో మిగిలినది ఏదయినా ఉంటే దానిని తెలియజేయాలి-అని భావం. దీనికి ఆచార్యుడు పలికే సమాధానం ఇక తెలుపబడుతున్నది.



**(ఉక్తా తే ఉపనిషత్)-** ఆ ఉపనిషత్ నీకు చెప్పబడింది.

**(బ్రాహ్మీం వావ త ఉపనిషదమబ్రూమేతి) -** బ్రహ్మం యొక్క అనుగ్రహాన్ని కల్గించే ఉపాయమైన ఉపాసననుగూర్చి మొత్తం తెలియజేశాము. ఇక, దానిని గూర్చి చెప్పవలసినది ఏదీ లేదు-అని భావం. "వావ" అనేది ఏవకారార్థాన్ని కల్గినదై, అన్యయోగవ్యవచ్ఛేదాన్ని తెల్పుతున్నది. "సా బ్రాహ్మేతి హోవాచ" అని ఆరంభించి, బ్రహ్మాన్ని గూర్చి చెప్పవలసినది అంతా ఈ నాల్గవ ఖండంలో చెప్పాము. ఇక చెప్పవలసినది ఏదీ లేదు" అని ఆనందభాష్యం. తరువాత మంత్రంలో ఆచార్యుడు ఇంకా కొన్ని ఉపదేశాలను చేస్తున్నందున, "అబ్రూమ" అనేదానికి "వక్ష్యామః" (చెప్పగలం) అనే అర్థాన్ని గ్రహించి, "బ్రహ్మను గూర్చి పలికే ప్రధానోపనిషత్ చెప్పబడింది. ఆబ్రహ్మం యొక్క అనుగ్రహానికి సాధనాన్ని పలికే ఉపనిషత్తును గూర్చి ఇక పల్కుతాము" అని ప్రతిపదార్థదీపికలో, ప్రకాశికలో అర్థం తెలుపబడింది. "బ్రహ్మవిద్య చెప్పబడింది. బ్రహ్మవిద్యకు ఉపయోగించేదానిని తరువాత మంత్రంలో పల్కుతాను" అని సుబోధినిలో తెలుపబడింది. "పరమకృపను కల ఆచార్యుడు శిష్యుడు అడుగకుండానే బ్రహ్మవిద్యయొక్క ఉత్పత్తిస్థితి కారణాలను తరువాత మంత్రంలో పల్కుతున్నాడు" అని ఆనందభాష్యం.

**8. తస్యై తపో దమః కర్మేతి ప్రతిష్ఠా ।**
**వేదాః సర్వాంగాని సత్యమాయతనమ్ ॥**

తస్యై= ఆ బ్రహ్మవిద్యకు, తపః దమః కర్మ ఇతి ప్రతిష్ఠా = (శరీరాన్ని ఉపవాసం మొదలైన వానితో కృశింపజేయడమనే) తపస్సు, ఇంద్రియాలను నియంత్రించడమనే దమం, అగ్నిహోత్రం మొదలైన కర్మలు-అనేవి ముందు మంత్రలో చెప్పబడిన బ్రహ్మవిద్య స్థిరంగా నిలచి

ఉండడానికి కారణాలు అవుతున్నాయి, వేదాః = వేదాలు, సర్వాంగాని= దాని ఆఱు అంగాలు, సత్యం = నిజాన్ని పల్కడం- (అనేవి), ఆయతనం = ఆ బ్రహ్మవిద్యయొక్క ఉత్పత్తికి కారణాలవుతున్నాయి.

అవ: ఆచార్యుడు శిష్యునకు బ్రహ్మవిద్యోత్పత్తికి, వృద్ధికి కారణాలను ఉపదేశిస్తున్నాడు.

**వ్యాఖ్యానమ్: (తస్యై)** పూర్వం ఉపదేశింపబడిన బ్రహ్మవిద్యకు,

**(తపో దమః కర్మ ఇతి ప్రతిష్ఠా)**- ఉపవాసం వల్ల, "కాయోడునీడు కనియుణ్డు వీశుకడుజ్కాల్ నుకర్న్దు" అని పంచాగ్ని మధ్యంలో నిలచి చేయబడే తపస్సు, మనస్సును, బాహ్యేంద్రియాలను నియంత్రించడమనే దమం, అగ్నిహోత్రం, సంధ్యావందనాది కర్మలు-మొదలైనవి బ్రహ్మవిద్య స్థిరంగా నిలచి ఉండడానికి కారణాలు. వృద్ధి చెంది, పూర్తిచెందడానికి బ్రహ్మవిద్యకు అంగంగా ప్రతిదినం అభ్యసించవలసినవి-అని భావం.

**(వేదాః సర్వాంగాని సత్యమ్ ఆయతనమ్)** -ఋగ్యజుస్సామాథర్వణాలనే నాల్గు వేదాలు, శీక్షా, వ్యాకరణం, ఛందస్సు, నిరుక్తం, జ్యోతిషం, కల్పమనే ఆఱు అంగాలు, సత్యవచనం- మొదలైనవి బ్రహ్మవిద్యోత్పత్తికి కారణాలు. తపశ్శబ్దంతో కృచ్ఛ్రం, చాంద్రాయణం మొదలైన వ్రతాలు గ్రహింపబడుతున్నాయని ఆనందభాష్యం.

(సత్యమ్)- ఇతరులకు దుఃఖం కల్గించని సత్యాన్ని పల్కడం" - అని ఆనందభాష్యం. "వేదం, అంగాలు, సత్యవచనం-అనే మూడిటిని అభ్యసించడంవల్ల బ్రహ్మవిద్య ఉత్పత్తి అవుతుంది. ఏర్పడిన విద్య, తపస్సు, దమం, కర్మలు-అనేవి అనుష్ఠిస్తే వృద్ధి చెంది, పూర్తి అయి నిలుస్తుంది. అందువల్ల బ్రహ్మవిద్యను అనుష్ఠించేవారు ఉజ్జీవించే ఉపాయమైన వీటిని గ్రహించాలి-అని భావం.



**9. యో వా ఏతామేవం వేద అపహత్య పాప్మానమనంతే ।**
**స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి ప్రతితిష్ఠతి ॥**

యః వా = ఏ అధికారి, ఏతామ్ ఏవం వేద = ఈబ్రహ్మవిద్యను అంగాలతో పాటు తెలిసికొంటున్నాడో, (అతడు), పాప్మానం = (మోక్షానికి అంతరాయమైన) పుణ్యాపాపాలను అన్నిటిని, అపహత్య = విడిచి, అనంతే= అంతు లేనిది, జ్యేయే= మిక్కిలి గొప్పది, స్వర్గే లోకే= సాటి లేని ఆనందాన్ని ఇచ్చే వైకుంఠలోకంలో, ప్రతితిష్ఠతి = నిత్యమైన ఉజ్జీవనాన్ని పొందుతున్నాడు.

అవ: ఈ ఉపనిషత్తులో చివరి మంత్రమైన ఇందులో బ్రహ్మవిద్యాఫలాన్ని పల్కి ఈ ఉపనిషత్తు ముగుస్తున్నది.

**వ్యాఖ్యానమ్: (యో వా ఏతామేవం వేద)** ఎవడు, బ్రహ్మప్రాప్తి సాధనమైన ఈ బ్రహ్మవిద్యను, పూర్వం పల్కిన దాని ఉత్పత్తి స్థితి కారణమైన అంగాలతో పాటు తెలిసికొంటున్నాడో-అని అర్థం. అతనికి లభించే ఫలమైన అనిష్టనివృత్తిని, ఇష్టప్రాప్తిని మంత్రంలోని మిగిలిన భాగం తెల్పుతున్నది.

**(అపహత్య పాప్మానమ్)** - మోక్షానికి అడ్డుగా ఉండే పుణ్యాపాపాలను విడచి-అని అర్థం. "పుణ్యాపాపే విధూయ నిరంజనః పరమం సామ్యముపైతి" (ముండక- 3-1-3) (బ్రహ్మజ్ఞానిముక్తి దశలో పుణ్యాపాపాలను రెండిటిని విడచిపెట్టి, ఏవిధమైన నైచ్యాన్ని లేనివాడై, పరమాత్మతో గొప్పదైన సామ్యాన్ని పొందుతున్నాడు) అని ముక్తిదశలో బంగారు సంకెలవంటి పుణ్యం, ఇనుప సంకెలవంటి పాపం-అనే రెండు విడచివేస్తున్నందున, ఇక్కడ పాపశబ్దం ఇతనికి ఆటంకమైన పుణ్యాపాపాలను రెండిటిని తెల్పుతుంది. ఇది ఇతనికి ఆటంకమైన

అజ్ఞానం, శబ్దాదివిషయాలలోని వాసన, రుచి, దేహ సంబంధం మొదలైన అన్నిటికి ఉపలక్షణం. ఇందువల్ల, అనిష్టాలు అన్నీ నశిస్తాయి. అని తెలుపబడుతున్నది. ఇక, ఇష్టప్రాప్తి తెలుపబడుతున్నది.

**(అనంతే స్వర్గే లోకే జ్యేయే ప్రతితిష్ఠతి)** అంతులేనిదై, సాటిలేని సుఖాన్ని ఇచ్చేదై, మిక్కిలి పెద్దది అయిన మోక్షలోకమైన శ్రీవైకుంఠంలో స్థిరంగా ఉంటాడు.

**(అనంతే)**- కాలంవల్ల, దేశంవల్ల, భోగ్యత, ప్రకాశం మొదలైన వానివల్ల అవధి లేనిది."కాలం సపచతే యత్ర న కాల స్తత్ర వై ప్రభుః" (కాలాన్ని విష్ణువు ఎక్కడ ఉండి నియమిస్తున్నాడో, అక్కడ కాలం ప్రభుత్వాన్ని నడపడంలేదు) "అత్యర్కానలదీప్తం తత్ స్థానం విష్ణోర్మహాత్మనః, స్వయైవ ప్రభయా రాజన్! దుష్ప్రేక్ష్యం దేవ దానవైః, తత్ర గత్వా పునర్నేమం లోకమాయాంతి భారత" (భారతమ్- ఆరణ్యపర్వమ్- 136-18-23) (మహాత్ముడైన విష్ణువుయొక్క ఆస్థానం సూర్యునియొక్క, అగ్నియొక్క కాంతిని మించినది. రాజా! అది తన కాంతితోనే దేవతలకు, అసురులకు చూడడానికి సాధ్యం కానిది. భరతవంశంలో పుట్టినవాడా! అక్కడకు పోయిన తరువాత మళ్ళీ ~~ఈ~~ లోకానికి తిరిగిరావడం లేదు)

**(జ్యేయే)** మిక్కిలి గొప్పదైన లోకంలో- అని అర్థం. "తద్విష్ణోః పరమం పదం సదా పశ్యంతి సూరయః, దివీవ చక్షురాతతమ్, తద్విప్రాసో విపన్యవో జాగృవాంస స్సమింధతే, విష్ణోర్యత్ పరమం పదమ్" (ఋగ్వేదమ్- అష్టకమ్- 1-2-7) (ఏ విష్ణువు యొక్క, సూర్యునివంటి ప్రకాశాన్ని కల ఏ పరమపదం ఉన్నదో, ఆ పరమపదాన్ని నిత్యసూరులు ఎల్లప్పుడు దర్శిస్తున్నారు. ఆ పరమపదం, అన్నిటిని ప్రకాశింపజేసేవాడు,



ఆకాశంలో ఉండేవాడు, లోకానికి అంతటికి నేత్రభూతుడు అయిన సూర్యునివలె ప్రకాశాన్ని కల్గినది. విష్ణువుయొక్క ఏ పరమపదం ఉన్నదో, అందులో, మేధావులు, స్తుతించడమే స్వభావంగా కలవారు, జాగరుకులై ఉండేవారైన నిత్యసూరులు ప్రకాశిస్తున్నారు) అని చాలా గొప్ప స్థానంగా, నిత్యసూరులచే సదా దర్శింపబడేదిగా, గొప్ప కాంతిని కల్గినదిగా వేదంలోనే చెప్పబడినందున, అన్ని లోకాలకంటే గొప్పది ఇదే కదా!

**(స్వర్గే లోకే)**- దుఃఖం కొంచెంకూడా కలవనిది, సాటి లేని సుఖరూపమైనది అయిన శ్రీవైకుంఠలోకంలో- అని అర్థం. "అనంతే" అని అంతు లేనిదిగా, ''జ్యేయే'' అని గొప్పదిగా విశేషించి చెప్పబడుతున్నందున, అల్పాస్థిర సుఖాలను ఇచ్చే దేవేంద్రుని స్వర్గం కంటే అతిశయాన్ని కల విష్ణుస్థానమే ఇది-అని తెలుపబడుతున్నది. "విష్ణుసంస్మరణాత్ క్షీణసమస్తక్లేశసంచయః, ముక్తిం ప్రయాతి స్వర్గేపి స్తస్య విఘ్నోనుమీయతే, వాసుదేవే మనో యస్య జపహోమార్చనాదిషు, తస్యాంతరాయో మైత్రేయ దేవేంద్రత్వాదికం ఫలమ్" (విష్ణు-పు-2-6-40-41) (విష్ణువును స్మరించినందున దుఃఖసమూహాలన్నీ తీరినవాడై, మోక్షాన్ని పొందుతున్నాడు. స్వర్గాన్ని పొందడం అతడు తనకు ఆటంకంగా భావిస్తాడు మైత్రేయా! జపం, హోమం, అర్చనం, మొదలైనవానిలో ఎవని మనస్సు వాసుదేవునిలో లగ్నమవుతున్నదో, అతనికి దేవేంద్రపదవి మొదలైన ఫలాలు అంతరాయాలు అవుతున్నాయి) అని చెప్పబడినది కదా!

**(ప్రతితిష్ఠతి)** స్థిరంగా నిలచి ఉంటాడు. తిరిగి సంసారమండలానికి రావడం లేదు-అని భావం. "స ఖల్వేవం వర్తయన్ యావదాయుషం బ్రహ్మ లోకమభిసంపద్యతే, న చ పునరావర్తతే న చ పునరావర్తతే" (ఛాందో-8-15-1) (వర్ణాశ్రమధర్మాలను, ఉపాసనను

ఆయుస్సు ఉన్నంతవరకు అనుష్ఠించి బ్రహ్మలోకాన్ని ముక్తుడు పొందుతాడు. తిరిగి సంసారానికి రావడంలేదు), "తేషాం న పునరావృత్తిః" (బృహ-8-2-15) (ముక్తిని పొందినవారు సంసారానికి తిరిగిరారు) అనే వేదవాక్యాలను గమనించాలి. ఈ వేదవాక్యాలను శ్రీకృష్ణుడు గీతలో "మాముపేత్య పునర్జన్మ దుఃఖా లయమశాశ్వతమ్, నాప్నువంతి మహాత్మానః సంసిద్ధిం పరమాం గతాః" (గొప్ప సంసిద్ధిరూపమైన నన్ను పొందినవారు, మహాత్ములైన జ్ఞానులు, నన్ను పొందిన తరువాత, అన్నిదుఃఖాలకు స్థానమైనది, అస్థిరమైనది అయిన దేహాన్ని మళ్ళీ పొందరు) అని, "ఆబ్రహ్మభువనాల్లోకాః పునరావర్తనోర్జున, మాముపేత్య తు కౌంతేయ పునర్జన్మ న విద్యతే" (అర్జునా! బ్రహ్మండంలోపల ఉండే బ్రహ్మలోకం వరకు గల అన్ని లోకాలు నాశం కల్గినవి. కుంతీపుత్రా! నన్ను పొందిన తరువాత అయితే మఱుజన్మ లేదు) అని వివరించారు.

(స్వర్గే లోకే ప్రతితిష్ఠంతి) - "స్వర్గే- దుఃఖలేశాసంస్పృష్టే సుఖే లోకే- సాకేతాఖ్య శ్రీరామచంద్ర బ్రహ్మధామ్ని యద్వా, లోక్యతే అనేనేతి లోకః; తస్మిన్ ప్రకాశరూపే శ్రీరామాఖ్యే పరబ్రహ్మణి, ప్రతితిష్ఠతి- ప్రతిష్ఠాం ప్రాప్నోతి, న భగవద్ధామ్నః పునర్నాగచ్ఛతి" ("స్వర్గే లోకే" కొంచెం కూడా దుఃఖస్పర్శలేని, సుఖరూపమైన, లోకే-సాకేతమనే పేరును కల శ్రీరామచంద్ర బ్రహ్మంయొక్క లోకంలో-అని అర్థం. లేక, "లోక్యతే అనేనేతి లోకః" అనే వ్యుత్పత్తివల్ల దర్శించడానికి సాధనమైన ప్రకాశరూపమైన, ప్రకాశరూపమైన శ్రీరాముడనే పరబ్రహ్మలో- అని కూడా చెప్పవచ్చు. "ప్రతితిష్ఠతి" - నిలకడగా నిలచి ఉంటాడు. అతడు భగవానుని లోకంనుండి తిరిగిరాడు) అని శ్రీరామభక్తుడైన రామానందులు ఆనందభాష్యంలో వివరించారు. "ప్రతితిష్ఠతి"-అని రెండుసార్లు పఠించడం ఈ ఉపనిషత్ పూర్తి అవుతుంది- అనే దానిని చూపుతున్నది.



ఈ చివరి మంత్రంలో బ్రహ్మవిద్యయొక్క ఫలాన్ని చెప్పేటపుడు "పాపాలు తీరి, పరమాత్మలోకంలో శాశ్వతంగా నిలచి ఉంటాడు" అని అన్నందున ఈ ఉపనిషత్తులో "జీవుడు బ్రహ్మమే అవుతున్నాడు" అనే అద్వైతవాదానికి తావు ఏమాత్రం లేదు- అని వ్యక్తమవుతున్నది.

**ఉభయవేదాంతైకకంఠ్యం: (4-4,5,6,7,8,9,10)**

నాల్గవ ఖండంలోని నాల్గవ మంత్రం నుండి ఎనిమిదవ మంత్రం వరకు అంగాలతో కూడిన బ్రహ్మవిద్య అనే ఉపాసనం వివరింపబడింది. ఈబ్రహ్మవిద్యలను గూర్చి "నిఱముయర్ కోలముమ్ పేరుమ్ ఉరువుమ్ ఇవై ఇవై యెన్ఱు అఱముయల్ ఞాన చ్చమయికళ్ పేశిలుమ్" (వర్ణం, గొప్ప అలంకారం, పేరు, రూపం-ఇవి ఇవి అని ధర్మమార్గంలో ప్రయత్నించి జ్ఞానాన్ని పొందిన వైదికులు పల్కినా) (తిరువిరు-44) అని తిరువిరుత్తంలోను, "వీడుమిన్ ము*ఱ్ఱ*వుమ్" (తిరువాయ్మొ*ழி*-1-2) (దశకం)లోను, "పత్తుడై" (1-3) దశకంలోని "వణక్కుడై త్తవనెఱివ*ழி* నిన్ఱు పుఱనెఱికళై విట్టు ఉణక్కుమిన్ పశైయఱ అవనుడై ఉణర్వుకొణ్డు ఉణర్న్దే" (భక్తిమార్గంలో నిలచి, బాహ్యవిషయాలనే కలుపును ఛేదించి, అతడు తెల్పిన జ్ఞానంతో ఆ స్వామిని దర్శించి, వాసనలు నశించేటట్లు ఆ కలుపును ఎండ గట్టండి.) (తిరువాయ్-1-3-5) అనే పాశురంలోను నమ్మ*ழ்*వార్లచే అనుగ్రహింపబడింది. ముదలా*ழ்*వార్లలో పొయ్కై ఆ*ழ்*వార్ "వారిశురుక్కి మదక్కళిత్తైన్దినైయుమ్ శేరి తిరియామల్ శెన్నిఱీ కూరియ మెయ్ఞానత్తాల్ ఉణర్వార్ కాణ్బరే మేలొరునాళ్ కైన్నాకమ్ కాత్తాన్క*ழ*ల్" (ముదల్తిరు-47), "అరియపులన్ ఐన్దడక్కి ఆయ్ మలర్కొణ్డు ఆర్వమ్ పురియ ప్పరిశినాల్ పులకిల్, పెరియనాయ్ మా*ఱ్ఱ*త్తువీ*ఱ్ఱ*ిరున్ద మావలిపాల్ వణ్కైనీర్ ఏ*ఱ్ఱ*ానైక్కాణ్బదు ఎళియ" (నిరోధించడానికి

సాధ్యంకాని పంచేంద్రియాలను నిరోధించి, శుద్ధమైన పూలను సమర్పించి, వృద్ధిచెందే భక్తితో నమస్కరిస్తే, తనను గొప్పవాడని తలచి, ఏనాటికీ మారని మహాబలి దగ్గర తనచేతిలో దానజలాన్ని గ్రహించిన స్వామిని దర్శించడం సులభమవుతుంది) (ముదల్ తిరు-50) అనే పాశురాలలో అంగాలతో కూడిన భక్తిరూపమైన జ్ఞానంతో భగవానుని దర్శించవచ్చు-అని వ్యక్తం చేశారు. ఇంకా పలు పాశురాలున్నాయి. చివరి మంత్రంలో బ్రహ్మవిద్యకు ఫలంగా పాపాలు తీరి, నాశం లేనిది, శాశ్వతంగా నిలచి ఉండేది అయిన ఆనందమయమైన లోకాన్ని పొందడం చెప్పబడింది. ఈ విషయం "నాడుమ్ నకరుమ్ నన్గుడన్ కాణ నలనిడై ఊర్తి పణ్ణి వీడుమ్ పెఱుత్తి త్తన్ మూవులకుక్కుమ్ తరుమ్ ఒరునాయకనే" (దేశం, పట్టణాలు అంతా చక్కగా చూచేటట్లుగా శేషత్వమనే సంపదను కల్గించి, పరమపదాన్ని అనుగ్రహించి ఈ లీలావిభూతిలోని ఆధిపత్యాన్ని కూడా ఇచ్చే అద్వితీయుడైన స్వామి) (తిరువాయ్-3-10-11), "తన్నాకవే కొణ్డుశన్మమ్ శెయ్యమైయుమ్ కొళ్ళుమే" (తనవానినిగా చేసికొని జన్మలేకుండా చేస్తాడు) (తిరువాయ్-3-9-4), "శాయ్‌కొణ్డ ఇమ్మైయుమ్ శాదిత్తు వానవర్‌నాట్టైయుమ్ నీ కణ్డుకొళ్ ఎన్ఱు వీడుమ్ తరుమ్ నిన్ఱు నిన్ఱే" (గొప్ప ఇహలోక పురుషార్థాలను ఇచ్చి, పరమపదాన్ని కూడా నీవు పొందు-అని దానిని కూడా నిదానించి ఇస్తాడు) (తిరువాయ్-3-9-9) మొదలైన పలు పాశురాలలో నమ్మాళ్వార్ల చేత వివరింపబడింది. "పేరణి వైకున్దత్తు ఎన్ఱుమ్ పేణియిరుప్పరే" (గొప్ప అందమైన వైకుంఠాన్ని సదా ఆదరిస్తాడు) (పెరియాళ్వార్ తిరు- 4-6-10), "నణ్ణువారొల్లై నారణనులకే" (త్వరగా నారాయణుని లోకమైన వైకుంఠాన్ని పొందగలరు) (పెరియాళ్వార్‌తిరు-5-1-10), "పల్లాణ్డవ్ పరమాత్మనై చ్చూళ్‌న్దిరున్దేత్తువర్ పల్లాణ్డే" (పరమాత్మను ప్రదక్షిణం చేసి,



మంగళాశాసనం చేస్తారు) (తిరుప్పల్లాణ్డు- 12) అని పెరియాళ్వార్లు, "కుఱైవిన్ఱి వైకున్దమ్ శేరువరే" (ఏ లోటు లేకుండా వైకుంఠాన్ని చేరుతారు) (నాచ్చియార్‌తిరు-2-10), "మన్నియ మాదవనోడు వైకున్దవ్ పుక్కిరుప్పారే" (మాధవునితో పాటు వైకుంఠానన్ని చేరుతారు) (నాచ్చియార్ తిరు-3-10), "ఏత్తవల్లవర్‌క్కిడమ్ వైకున్దమ్" (ఈ దశకాన్ని అనుసంధించే వారుండే చోటు వైకుంఠం) (నాచ్చియార్ తిరు-12-10) అని గోదాదేవి, "నణ్ణువారొల్లై నారణనులకే" (ఈ దశకాన్ని అనుసంధించేవారు త్వరగా వైకుంఠాన్ని చేరుతారు) (పెరుమాళ్ తిరు-7-11) అని కులశేఖరాళ్వార్లు, "అచ్చమ్ నోయొడు అల్లల్ పలపిఱప్పవాయ మూప్పిలై వైత్త శిన్దై వైత్త వాక్కై మాఱ్ఱి వానిల్ ఏఱ్ఱువాన్ అచ్చుతన్ అనంతకీర్త్తి ఆది యన్దమిల్లవన్ నచ్చునాకణై క్కిడన్ద నాదన్ వేతకీతనే" (భయం, ఆధి, వ్యాధి, అపాయాలను కల్గించే వార్ధక్యం, పలు జన్మలు, అనే వీటిని, వీనిని అనుభవించే మనస్సు, వీటికి ఆధారమైన శరీరం అనే వీనిని పోగొట్టి, పరమపదంలోకి చేర్చేవాడు-దాసులను ఏనాడూ విడువనివాడు, అంతులేని కల్యాణగుణాలను కలవాడు, ఆద్యంతాలు లేనివాడు, విరోధులపై విషాన్ని చిమ్మే ఆదిశేషుడనే పడుకపై శయనించేవాడు, వేదాలచే స్తుతింపబడేవాడైన సర్వస్వామి) (తిరుచ్చంద-117) అని తిరుమళిశైయాళ్వార్లు, "ఏత్తవల్లార్‌క్కిడమ్ వైకున్దమే" (స్తుతించగల్గిన వారుండే చోటు వైకుంఠం) (పెరియ తిరు-2-8-10), "ఏరార్న్ద వైకున్దత్తు ఇమైయనరోడిరుప్పారే" (గొప్పదైన వైకుంఠంలో నిత్యసూరులతో కలసి ఉంటారు) (పెరియ తిరు-4-1-10), "ఏర్‌కొళ్ నల్‌వైకున్దత్తుళ్ ఇన్బమ్ నాళుమ్ ఎయ్‌దువరే" (గొప్పదైన వైకుంఠంలో నిత్యవాసం పొందుతారు) (పెరియ తిరు-4-8-10), "ఏర్‌కొళ్ వైకున్ద మానకర్‌పుక్కు ఇమైయవరోడుమ్ కూడువరే" (గొప్ప వైకుంఠనగరాన్ని

చేరి, నిత్యసూరులతో కలసి ఉంటారు.) (పెరియ తిరు-8-5-10; "తొణ్డర్క్కు ఇడమావదు పాడిల్ వైకున్దమే" (భక్తులుండే చోటు ఏ దుఃఖం లేని వైకుంఠం) (పెరియ తిరు-9-3-10) మొదలైన పలు పాశురాలలో తిరుమఙ్గై ఆళ్వార్లు ఈ విషయాన్ని ఘోషించారు. వీటినిబట్టి సంస్కృతవేదం, ద్రావిడవేదం ఒకే అర్థాన్నే పల్కుతున్నాయి-అని తెలుస్తున్నది.

## ఉపసంహారం

ఈ ఉపనిషత్తులో చెప్పబడిన విషయాల:

**(1)** అనంతుడై, వాక్కు మొదలైన ఇంద్రియాలను నియమించేవాడైనందున, హృషీకేశుడనబడేవాడై, వాటిచే తెలియడానికి సాధ్యం కానివాడే- పరమాత్మ.

**(2)** అతనిని గూర్చి పూర్తిగా తెలియడం సాధ్యం కాకపోయినా, జ్ఞానానికి అందినంతవరకు తెలిసికొని, అతని కృపతో మోక్షాన్ని పొందవచ్చు.

**(3)** అగ్ని, వాయువు, ఇంద్రుడు మొదలైన గొప్ప దేవతలను కూడా తెలియరాని అతనిని అతని అనుగ్రహంవల్లనే తెలియడం వీలవుతుంది.

**(4)** తపస్సు, ఇంద్రియనిగ్రహం-అనే దమం, అగ్నిహోత్రాది కర్మలు, అంగాలతో కూడిన వేదాలు, సత్యభూషణం మొదలైనవానిని



అంగాలుగా కల బ్రహ్మవిద్యద్వారా అతనిని తెలియవచ్చు.

**(5)** ఈ విధంగా తెలిసికొన్నవాడు గొప్పదైన లోకంలో ఆ పరతత్త్వాన్ని పొంది, సంసారానికి మళ్ళీ తిరిగిరాడు.

ఈ విషయాల వల్ల విశిష్టాద్వైత శ్రీవైష్ణవ సిద్ధాంతమే ఈ ఉపనిషత్‌లో సిద్ధాంతమని వ్యక్తమవుతున్నది.

